LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM

Visit Internet Edition @ www.nellore.com

# జమీన్‌రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు | సంపుటి : 71 | సంచిక : 16 | 21.4.2000 శుక్రవారం | 12 పేజీలు | విడిప్రతి: రూ.2.00లు | జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

# తెలుగు ఎమ్మెల్యేలు అదుపు తప్పుతున్నారా?

తెలుగుదేశం ఎమ్మెల్యేలలో అసంతృప్తి అవధులు మీరుతున్నది; రేపో మాపో బద్దలు కానున్న అగ్ని పర్వతం వలె భుగభుగ మంటున్నది. ముఖ్యమంత్రి మీద కారాలు, మిరియాలు నూరుతున్నారు; సమక్షంలో అతి వినయం నటించినా, ప్రక్కకు తిరగగానే పళ్లు పటపట కొరుకుతున్నారు. వారి క్రోధానికి కారణం - తమను నిర్లక్ష్యం చేస్తున్నారన్న అభిప్రాయం. గతంలో ఎమ్మెల్యేలను నెత్తిన పెట్టుకొని మోశారు చంద్రబాబు. వారేమి అడిగితే అది చేశారు. జన్మభూమి కార్యక్రమం సమస్తం ఎమ్మెల్యేల ఇష్టారాజ్యంగా నడిచింది. ప్రతి ఎమ్మెల్యే తృణమో, పణమో ఆర్జించారు. కొందరు కోటీశ్వరులయ్యారు. పక్కా ఇళ్ల పథకంలో లబ్ధిదారుల ఎంపికకు ఎమ్మెల్యేల సిఫార్సు చీటీలే ఆధారం. దానితో గ్రామాలలో పది మందిని వెంటత్రిప్పుకోవడానికి వీలైంది. ఎమ్మార్వో, ఎమ్డీవో కార్యాలయాలు, పోలీసు స్టేషన్లు, ఎమ్మెల్యేల జాగీరులుగా పని చేశాయి. వారి గ్రీన్ సిగ్నల్ లేనిదే ఏ పని జరగడానికి లేదు; వారు చెప్పిన వారే సీట్లలో వుండేవారు; కాదంటే బదలీ కాగితం చేతికి అందేది. కలెక్టర్లు సైతం ఎమ్మెల్యేలకు చెప్పకుండా నియోజక వర్గాలలో ఏ నిర్ణయం తీసుకోగల్గేవారు కాదు. అంత రాజరికంతో

## పిల్లిమెడకు గంట కట్టేవారు ఎవరన్నదే ప్రశ్న

వెలుగు వెలిగిన ఎమ్మెల్యేలు ఇప్పటి పరిస్థితులను జీర్ణించుకోలేక పోతున్నారు.

అప్పటికి ఇప్పటికి వచ్చిన ముఖ్యమైన మార్పు - ముఖ్యమంత్రి వైఖరి! అప్పట్లో ఎంత పని వత్తిడి వున్నా ఎమ్మెల్యేలు వెయిటింగ్‌లో వుండాల్సి వచ్చేది కాదు; కాని ఇప్పుడు ఎమ్మెల్యేలకు సిఎంతో ఇంటర్వ్యూ దొరకడం లేదు. పార్టీ సమావేశాలు, సమీక్షల సమయంలో తప్ప వ్యక్తిగతంగా ఎవరిని కలవడానికి సిఎం ఇష్టపడడం లేదు. ఇది వరకు ఎమ్మెల్యేలు అడిగిన పనులు జరిగిందీ లేనిదీ చంద్రబాబే స్వయంగా విచారించేవారు. ఇప్పుడు ఎమ్మెల్యేలను తన సెక్రటరీల దగ్గరకు పంపుతున్నారు. ఆ సెక్రటరీలు వీరిని కసిరి కొడుతున్నారు. తమ పని జరగలేదని మళ్లీ వెళ్లి చెప్పాలంటే - చంద్రబాబు దర్శనం దుర్లభం. ముఖ్యమంత్రి వ్యక్తిగత కార్యదర్శుల దగ్గర మంత్రులకు పరాభవం తప్పడం లేదు.

ఇంకొక ప్రక్క సిఎంలో అసహనం పెరిగిపోయింది. చీటికి మాటికి చిరాకు పడుతున్నారాయన. ఎమ్మెల్యేలను, మంత్రులను కసిరి కొడ్తున్నారు; పది మందిలో పరువుపోతున్నా, దిగమింగుకోవడం తప్ప ఏమీ చేయలేని నిస్సహాయస్థితి. అప్పుడు ఎమ్మెల్యేల దయ వల్లే తనకు అధికారం లభించిందన్న గిల్టినెస్ వుండేది చంద్రబాబులో; ఇప్పుడు తన దయవల్ల ఎమ్మెల్యేలు గెలుస్తున్నారన్న అహం భావం పెరిగింది.

వీటన్నిటికంటే ఎమ్మెల్యేలను అధికంగా బాధిస్తున్న విషయం - ఉప ఎన్నికలు జరిగినప్పటి నుంచి ప్రభుత్వపరంగా ఒక్క కార్యక్రమం ప్రారంభం కాలేదు. కనీసం పక్కా ఇళ్లు కూడా లేవు. ఏ పని అడిగినా డబ్బెక్కడుంది అని ప్రశ్నిస్తున్నారు ముఖ్యమంత్రి. ఎన్నికలలో ఏవేవో వాగ్దానాలు చేసి, ఏ పని చేపట్టకుండా గ్రామాలకు వెళ్లవలసి రావడం కష్టంగావుంది. దానికితోడు ధరల పెంపకం. ఊళ్లోకి వెళ్లి జనం చేత తిట్లు తినడం ఎందుకని భావించి, ఎక్కడా తిరగడం మానేస్తున్నారు శాసన సభ్యులు.

తరువాయి 7వ పేజీలో

# నెల్లూరు రాజులకు కాకతీయుల అండ!

*(గత సంచిక తరువాయి)*

చాళుక్యుల తర్వాత నెల్లూరులో చోళుల పాలన ప్రారంభమైంది. పంద్రంగుడి కాలంలో జయింపబడిన పెన్నకు దక్షిణ భాగంలోని నెల్లూరు జిల్లాను, ఆ తర్వాత పల్లవులు తిరిగి తమ వశం చేసుకున్నారు. మొదట పరాంతక చోళుడు (క్రీ.శ. 907-953) పల్లవులను పరాజితులను చేసి నెల్లూరు జిల్లాను స్వాధీనం చేసుకున్నాడు. చోళ సామ్రాజ్యానికి పునాది వేసిన వాడు ఇతడే. చోళులకు సామంతులుగా 12వ శతాబ్దం మొదటి భాగం నుంచి తెలుగుచోడులు రాజ్యాధికారం చేపట్టారు. కంచి నుంచి నెల్లూరు వరకు వీరి ఏలుబడిలో వుండింది. వీరిలో నల్లసిద్ధి అనే రాజు కంచి, విక్రమ సింహపురి నగరాలు రెంటింటినీ తన రాజధానులుగా వినియోగించాడు. నల్లసిద్ధి తర్వాత వచ్చిన మొదటి చేత, ఎర్రసిద్ధి అనే రాజులు చోళుల ఆధిపత్యాన్ని ధిక్కరించి స్వతంత్ర రాజులుగా పాలన చేశారు. ఎర్రసిద్ధి తర్వాత అతడి కుమారులలో ఒకడైన మొదటి మనుమసిద్ధి రాజ్యం చేపట్టాడు. అయితే చోళరాజు మూడవ కులోత్తుంగుడు (క్రీ.శ. 1128- 1216) నెల్లూరుపై దండెత్తి, మనుమసిద్ధిని ఓడించి, తెలుగు చోడుల మీద చోళుల ఆధిపత్యాన్ని తిరిగి స్థాపించాడు. క్రీ.శ. 1180 ప్రాంతంలో ఈ విజయం సిద్ధించినట్టు - రంగనాయక స్వామి దేవాలయంలో లభించిన శాసనం వెల్లడిస్తున్నది. మూడవ కులోత్తుంగుడికి "మధురైయుం, పాణ్డియన్ ముడిత్తలైయుం కొణ్డురుళియ" అనే బిరుదు వుంది. దాని అర్థం - మధురను, పాండ్యుల తలను జయించినవాడు - అని! కంచి, కాళహస్తి, నందలూరులలోనూ ఇతడి శాసనాలు లభ్యమైనాయి.

తన విజయం తర్వాత ఇతడు మనుమసిద్ధి తమ్ముడైన నల్లసిద్ధికి సింహాసనం అప్పచెప్పాడు. నల్లసిద్ధి చోళులకు విధేయుడుగావుంటూ క్రీ.శ. 1187 నుంచి 1204 వరకు నెల్లూరును పరిపాలించాడు. నల్లసిద్ధి శాసనాలు రంగనాయకుల స్వామి గుడిలో, పెద్ద మసీదు వీధిలోను లభించాయి. ఇతడి తర్వాత ఇతడి తమ్ముడు తమ్ముసిద్ధి సింహాసనం ఆక్రమించి 1204 నుంచి 1208 వరకు నాలుగేళ్ల పాటు పాలించాడు.

## మనుమసిద్ధికి మనఃశాంతి కరవు; ఓరుగల్లులో తిక్కనకు ఎనలేని గౌరవం.

### *కాకతీయుల రంగ ప్రవేశం*

నెల్లూరు జిల్లా రాజకీయాలలో కాకతీయుల ప్రవేశం 1208 సంవత్సరంలో జరిగింది. మొదటి మనుమసిద్ధి కుమారుడైన తిక్కడు - కాకతీయ గణపతి దేవ చక్రవర్తి సహాయం అర్థించి, వారి సైన్యాన్ని వాడుకొని, నెల్లూరుపై దండెత్తి తనకు చిన్నాయన అయిన తమ్ముసిద్ధిని ఓడించి, పాలనాధికారం చేపట్టాడు. కాకతీయులు అతడికి అంత సహాయం చేయడానికి కారణం - ద్రాక్షారామం, శ్రీకూర్మంల మధ్య తీరాంధ్ర దేశాన్ని పాలిస్తుండిన వెలనాటి పృథ్వీశ్వరుడ్ని ఓడించడంలో తిక్కడు కాకతీయ సైన్యానికి తోడ్పాటు నందించడమే! తిక్కన నిర్వచనోత్తర రామాయణం, కేతన దశకుమార చరిత్రలలో ఈ వివరం వుంది. క్రీ.శ. 1213 నాటి చేబ్రోలు శాసనంలో కూడా కాకతీయుల సేనాధిపతి గణపతి దేముడి బావమరిది జయసేనాపతి ఈ విషయం ప్రకటించాడు.

అయితే కాకతీయుల సహాయంతో సింహాసనం ఎక్కినా తిక్కడు - చోళుల అధిపత్యాన్ని అంగీకరించి, వారికి సామంతు రాజుగా వ్యవహరించాడు. మూడవ కులోత్తుంగని రాపూరు తాలూకా చీకవోలు శాసనంలో ఇది చెప్పబడింది. తర్వాత కొంత కాలానికి మహారాష్ట్ర రాజులు చోళులపైకి దండెత్తి కొంత భాగం ఆక్రమించారు. ఆ యుద్ధంలో నెల్లూరు రాజ్యంలోని కంచి, చెంగల్పట్టు, ఉత్తర ఆర్కాటు జిల్లాలు తిక్కడి నుంచి చేజారిపోయాయి. 1215 నుంచి 1228 మధ్య కాలంలో అతడు రాజ్యభ్రష్టుడైనట్టు భావించాలి. అయితే తిరిగి 1228లో కాకతీయ గణపతి దేముడి సహాయంతో తిక్కడు తన రాజ్యాన్ని తిరిగి సంపాదించుకున్నాడు. క్రీ.శ. 1228 నాటి గణపతి మల్టెవాడ శాసనం, క్రీ.శ. 1231 నాటి జయసేనాపతి గణపేశ్వరం శాసనాలు - చోళ, మహారాష్ట్ర, కర్ణాటక సైన్యాలను కాకతీయ సేనలు ఓడించి; కంచి, నెల్లూరు నగరాలను తిక్కడికి అప్పచెప్పినట్లు సూచిస్తున్నాయి. దీనికి కృతజ్ఞతా సూచకంగా తిక్కడు - గణపతి సామంతులలో ఒకడైన అంబదేముడి బావమరిది గంగసాహిణిని ఏగువ పాలకుడిగా నియమించాడు.

అయితే తిక్కడు చోళరాజులతో తన సంబంధాలు యథావిధిగా కొనసాగించాడు. 1239లో కర్ణాటక రాజు హొయసల రెండవ నరసింహుడు చోళులపై దండెత్తినప్పుడు, తిక్కడు తన సేనతో వెళ్లి అతడ్ని యుద్ధ భూమిలోనే చంపివేశాడు. ఆ తర్వాత సంవత్సరం నరసింహుడి కుమారుడు సోమేశ్వరుడ్ని కూడా యుద్ధంలో చంపాడు. ఈ విజయాలకు గుర్తుగా చోళులు తిక్కడికి "చోళస్థాపనాచార్య" అని బిరుదు ఇచ్చారు. అయితే తిక్కడు చేసిన ఈ రెండు యుద్ధాలలోనూ అతడికి కాకతీయ సహాయం అంది వుంటుందని భావించాలి.

### *మనుమసిద్ధికి మనశాంతి కరవు*

తిక్కడి తర్వాత నెల్లూరు రాజ్యాధికారం పేచీల మయమై పోయింది. తిక్కడి కుమారుడు మనుమసిద్ధి. అతడి దాయాది విజయగండ గోపాలుడు సింహాసనం కోసం తగాదా పడ్డారు. విజయగోపాలుడు - చెంగల్పట్టు, ఉత్తర ఆర్కాటు జిల్లాలను తన పరం చేసుకున్నాడు. మనుమసిద్ధికి నెల్లూరు, కడప జిల్లాలు మాత్రం మిగిలాయి. కొంత కాలం తర్వాత గండగోపాలుడు చోళుల సహాయంతో, కర్ణాటక రాజు సోమేశ్వరుడి తోడ్పాటుతో నెల్లూరును ఆక్రమించుకోవడానికి ప్రయత్నించాడు. ఆ ప్రయత్నంలో అతడు నెల్లూరు జిల్లా సరిహద్దుల వరకు వచ్చినట్లు వుంది. సూళ్లూరుపేట నాగేశ్వరస్వామి దేవాలయంలో అతడి శాసనం లభించడమే అందుకు రుజువు.

ఇంకొక ప్రక్క, పడిహారులు అనబడే బయ్యన, తిక్కనలు నెల్లూరుపై దండెత్తి

తొరవ 7వ పేజీలో

**నెల్లూరు జిల్లా పుట్టు పూర్వోత్తరాలు - 8**



**డాక్టర్ సి.వి. రామచంద్ర రావు**

# రాష్ట్రపతికి మనఃక్లేశం!

హైందవ సమాజంలోని కులాల కంపు ఒక్కొక్కసారి ఎంతటి హృదయ సంక్షోభానికి దారితీస్తుందో చెప్పలేము. పంచమ కులంలో పుట్టినవారికి - ఆకాశమంతెత్తుకు ఎదిగినా ఒక్కొక్క సందర్భంలో అవమానాలు తప్పడం లేదు. రాష్ట్రపతి కెఆర్. నారాయణన్ మహామేధావి; అసమాన ప్రతిభావంతుడు; అద్వితీయ రాజనీతిజ్ఞుడు. ప్రభుత్వంలో ఉన్నతాధికారిగా, దౌత్య ప్రతినిధిగా, పార్లమెంట్ సభ్యుడిగా, కేంద్రమంత్రిగా, ఉపరాష్ట్రపతిగా, రాష్ట్రపతిగా అత్యున్నత పదవులు అధిష్టించి; ప్రతి బాధ్యతలోనూ తన ముద్రవేయగల్గిన ప్రజ్ఞాశీలి. యాభైఏళ్ల సుదీర్ఘ కాలం ఆయన అనుభవించిన ఏ హోదాకు కూడా ఆయన కులం అర్హత కాలేదు; రిజర్వేషన్ల ఆసరాతో అధికారం చేపట్టలేదు. తన వ్యక్తిత్వ వైశిష్ట్యంతో స్వతంత్ర పోకడలతో, నిజాయితీ ప్రవర్తనతో, రుజువర్తనతో, మేధోసంపత్తితో యావత్ భారత ప్రజల మన్ననలు అందుకొని, రాష్ట్రపతి కిరీటం తనంతట తానుగా తన తలపై వచ్చి అలంకరింపబడేటట్లు చేసుకున్నారాయన. ఆయన జన్మతః దళితుడే తప్ప, దళిత ఉద్యమాలు నడిపినవాడు కాదు!

అంత పెద్ద పదవిలోకి, అంత ఉన్నతస్థాయికి వెళ్లిన తర్వాత కూడా ఆయన్ను "అంటరానివాడు" అని సంబోధిస్తే ఎంత మనఃక్లేశం కల్గుతుంది? ఫ్రెంచి దేశ పర్యటనకు వెళ్లిన కెఆర్. నారాయణన్, పారిస్‌కు చెందిన ప్రసిద్ధ పత్రిక "లిఫిగారో" ఆ పదంతో స్వాగతించింది. ఫ్రెంచి అధ్యక్షుడు జాక్వియస్ చిరాకీ నివాసంలో జరుగనున్న సమావేశం వార్త వ్రాస్తూ "యాన్ అన్‌టచ్‌బుల్ అట్ ఎల్లీ ప్యాలెస్" అనే హెడ్డింగ్ పెట్టిందా పత్రిక. తమ దేశంలో పర్యటించే ఇతర దేశాధ్యక్షుడ్ని ఇంతగా అవమానించడం ఘోరమైన నేరం. ఆ తర్వాత ఆ పత్రికాసంపాదకుడు రాష్ట్రపతికి బేషరతుగా క్షమాపణలు చెప్పడం - పెద్ద విషయం కాదు. అప్పటికే జరగవలసిన నష్టం జరిగిపోయింది.

భారతదేశం పట్ల, హైందవ సమాజంలోని కుల వ్యవస్థపట్ల పాశ్చాత్య దేశాల వారికి గల చులకన భావానికి చిహ్నం ఈ వ్యాఖ్య! నల్లజాతి వారంటేనే అధములని వారి అభిప్రాయం. అందువల్లనే రాష్ట్రపతి అనే మాట కూడా విస్మరించి, అంత తేలికగా వ్యాఖ్యానించగలిగారు.

పాశ్చాత్యులను తప్పు పట్టి ప్రయోజనం లేదు. అసలు లోపం మనలో వుంది. వందేళ్లకు పై నుంచి ఎందరో సంఘ సంస్కర్తలు, ఎన్నో ప్రభుత్వ శాసనాలు, లెక్కలేనన్ని దళిత ఉద్యమాలు... మన సమాజంలో నుంచి కుల వ్యవస్థను నిర్మూలించ లేకపోతున్నాయి. మన మనస్సులలో నుంచి కుల కాలుష్యాన్ని కడగలేకున్నాయి. నిద్రలేచిన దగ్గర నుంచి కుల ప్రస్తావన లేకుండా బ్రతకడం మన కలివి కావడం లేదు. ప్రతి రాజకీయ పార్టీకి అదే ఆలాపన. ఎన్నికకు అభ్యర్థులు, ఉద్యోగానికి అర్హతలు, సిఫార్సుకు కొలమానం, స్థాయీ భేదానికి తూకం కులమే ప్రాతిపదిక అవుతున్నది. ఏ దరఖాస్తు నింపాలన్నా కులం పేరు వ్రాయడం తప్పనిసరి. ప్రపంచంలో మరే సమాజంలోనూ ఈ నికృష్ట సాంప్రదాయం లేదు.

నాగరికత ఎంతో పెరిగింది; ప్రజల విజ్ఞానం ఎంతగానో అభివృద్ధి సాధించింది. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీతో దేశాల మధ్య ఎల్లలు చెరిగిపోతున్నాయి. వసుధైక కుటుంబం అన్న ఆర్యోక్తి వేరే రూపంలో నిజం చేస్తున్నాయి కంప్యూటర్లు. ఆకాశం, భూమి, వాయువు, అగ్ని మానవ శోధనకు లోబడుతున్నాయి. క్లోనింగ్ ద్వారా సృష్టికి ప్రతి సృష్టి చేస్తున్నారు శాస్త్రవేత్తలు. కాని మన మనసులలోని మాలిన్యం మాత్రం ఇసుమంత కూడాతరగడం లేదు; ఆ కుళ్లు కంపు మనల్ని వీడడం లేదు. ఈ నీచ, నికృష్ట కుల వ్యవస్థకు నిష్కృతి ఎప్పుడు? ఎట్లా?



ఎవరు చేస్తారు?

ప్రతి భారతీయుడు మనసు పెట్టి ఆలోచించవలసిన విషయమిది! హిందు మత పెద్దలు, సంస్థలు నడుం బిగించి, శ్రమించవలసిన విషయమిది! శంకరాచార్యులు, జియ్యర్‌స్వాములు వంటివారు జనాన్ని జాగృతం చేయవలసిన అత్యవసర కార్యమిది! హైందవ సమాజంలో సంస్కరణకు మత ప్రవక్తలు నేతృత్వం వహించడం చరిత్రలో ఎన్నోసార్లు జరిగింది. కాని దురదృష్టవశాత్తు మన పెద్దలు అంటరానితనాన్ని పెంచి పోషిస్తున్నారు. తమను ఇతరులెవ్వరూ తాకడానికి, కనీసం కాళ్లు పట్టుకోవడానికి సమ్మతించరు వారు. అందుకు వారు చెప్పే కారణం ఏదైనా - ఆ ప్రవర్తన కులవ్యవస్థను పెంచి పోషించడానికి తోడ్పడుతున్నది. రాజకీయ వాదులు ఇంకొక ప్రక్క కులాల వారీగా టిక్కెట్ల పంపకం జరిపి మరీ కులం కార్చిచ్చు చల్లారకుండా, నెగడు ఎగదోస్తున్నారు. జనం మర్చి పోయినా, వీరు దాన్ని తరచు జ్ఞాపకం చేస్తున్నారు. దురదృష్టకరం ఇది. వీరిలో మార్పురానిదే సమాజంలో మార్పు అసాధ్యం.

మహాకవి జాషువా, రాజ్యాంగ నిర్మాత అంబేద్కర్ వంటి పుణ్య పురుషులు అనుభవించిన మనఃక్లేశం - ఇన్నేళ్ల తర్వాత కెఆర్. నారాయణన్ ఎదుర్కోవలసి రావడం విచారకరం. రాష్ట్రపతి వ్యక్తిత్వ ఔన్నత్యానికి ఈ పత్రికా వ్యాఖ్య చెరుపు చేయలేక పోయినా, ఆయన హృదయం గాయపడడానికి కారణమైంది. భవిష్యత్తులో ఇటువంటివి పునరావృతం కాకూడదు. *



21.4.50

వెల: 0-2-0 పేజీలు: 12

## రమణమహర్షి అస్తమయం

అల్లకల్లోలములో మునిగిన ప్రపంచమునకు భగవాన్ శ్రీ రమణ మహర్షుల అస్తమయం గొడ్డలిపెట్టు వంటిది. నేటి దుర్భర జీవితం ననుభవించు ప్రజాకోటికి ఆత్మశాంతి నిచ్చుచు ఆధ్యాత్మిక జ్ఞానబోధ చేయుచు సన్మార్గ దర్శకులుగా నుండిన రమణ భగవానుల అస్తమయం యీ ప్రపంచము నెంతటి యంధకారములో ముంచినదో వర్ణింప నెవరితరము! మన దౌర్భాగ్యము వల్లనే కాబోలు వికృతి నామసంవత్సరం తన వికృత స్వభావోచిత చర్య నీ విధముగా ప్రదర్శించినది.

శ్రీరమణ భగవానులు తమ యాశ్రమ వాటికలో గత శుక్రవారము 14వ తేది రాత్రి 8.47 గం.లకు మహానిర్యాణ మొందిరి. అదే సమయమున ఆకాశవీధిలో నొక మహాజ్యోతి క్షణకాలము వెలిగి ఉత్తర దిక్కున అదృశ్యమైనది. అట్లే యీ ప్రపంచములో వెలిగిన రమణ జ్యోతి యదృశ్యమై పరంజ్యోతిలో నైక్యమై పోయినది. నాటి రమణాశ్రమ వాటిక భక్తులతో నిండి పోయినది. దేశ దేశముల నుంచి భక్తులు వచ్చిరి. ఆశ్రమము ఆ రాత్రి భజనా వినాదములతో నిండి పోయినది. మరునాటి సాయంకాలమున భగవానుని భౌతిక శరీరమును ఆశ్రమావరణంలోనే సమాధి చేసిరి. ఆశ్రమవాటిక పూర్వ చిహ్నములతోనె యున్నది గాని భగవానుని భౌతిక దేహ మొక్కటె యందుకానరాలేదు. అయిననేమి? ఆశ్రమవాటికలో నెందుచూచినను భగవానుని దివ్యశక్తి చరించు చుండెను. పూర్వ ప్రశాంత నిర్మల వాతావరణమే యందు వ్యాపించి యుండెను.

## పుచ్చలపల్లి సుందరయ్యగారిపై వారెంటు

దేశంలో దౌర్జన్యాలు సాగిస్తున్న రణదివే నాయకత్వంతో ఏకీభవించి శ్రీ

**50 ఏళ్లక్రితం ఈ వారం**

పుచ్చలపల్లి సుందరయ్య లాంటి వారిపై వారంటు రద్దు చేస్తే యీ క్లిష్టసమయంలో దేశానికి కొంత వుపయోగముండగలదని, అందువల్ల అతనిపై వున్న వారంటును రద్దుజెయ్యమని, శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య గారు 9-3-50తేది ప్రభుత్వానికొక వుత్తరం వ్రాసిరి.

దానికి తే19-4-550తేది జవాబిస్తూ, సుందరయ్య వచ్చి జిల్లా మేజిస్ట్రేటుకు పట్టుబడి, కమ్యూనిస్టులు సాగించే దౌర్జన్య చర్యలను బహిరంగంగా

తరువా 10వ పేజీలో

**జనవాణి**

# కౌన్సిలర్లు పన్నులు వసులు చేయించాలి?

నెల్లూరు మునిసిపాలిటీ దివాలా తీసిందని, ఏ రకమైన అభివృద్ధి పనులు చేయించలేమని ఛైర్మన్ అనూరాధ ప్రకటించారు. అభివృద్ధి పనులకు నిధులు సేకరించలేని ప్రజాప్రతినిధులు వుండిలేనట్లే. ఇప్పటికే మునిసిపాలిటీకి రావల్సిన బకాయిలు కోట్ల రూపాయల్లో వున్నాయి. ప్రతి మునిసిపల్ కౌన్సిలర్ తన వార్డులోని ఇంటి పన్నుల బకాయిదారుల జాబితాను తీసుకొని, వాటి వసూళ్లకు ప్రయత్నించాలి. ఈ విధంగా వసూలైన మొత్తంతో ఆ వార్డులోనే అభివృద్ధి పనులు చేసేలా ఒక తీర్మానాన్ని మునిసిపల్ సమావేశంలో ఆమోదింప చేస్తే బాగుంటుంది.

నెల్లూరు బి.రామచంద్రారెడ్డి

### డ్రైనేజి సమస్యకు పరిష్కారం లేదా?

రోడ్ల అభివృద్ధి పేరిట వీధుల్లోని రోడ్ల ఎత్తును 1 నుంచి 1 1/2 అడుగు ఎత్తుకు పెంచుకొంటూ పోతుండటం వల్ల మునిసిపల్ పరిధిలోని పలు వార్డుల్లో డ్రైనేజి సమస్య జటిలమవుతోంది. మునిసిపాలిటీ వారు రోడ్లు వేసినప్పుడల్లా ఇళ్లు లోతుకు పోతున్నాయి. వర్షాలు పడి నప్పుడు రోడ్లలో నీళ్లు ఇండ్లలోనికి ప్రవేశిస్తున్నాయి. ఇటీవల ఇళ్లు నిర్మించుకొనే వాళ్లు రోడ్డుకు 5 అడుగుల ఎత్తున బేస్‌మెంట్‌తో నిర్మించు కోవడం వల్ల, వారి ఇళ్లలోని మురికినీరు రోడ్లపై వుండడమే గాకుండా, పల్లంలో వున్న ఇళ్లలోకి అవి వచ్చి చేరుతున్నాయి. టౌన్ ప్లానింగ్ శాఖ కుంభకర్ణ నిద్రలో వుండడం వల్ల ఈ అవకతవకలన్నీ ఎక్కువవుతున్నాయి. కొత్త మునిసిపల్ పాలకవర్గమైనా ఈ విషయమై దృష్టి కేంద్రీకరిస్తే బాగుంటుంది.

నెల్లూరు కె.ఎస్. రావు

### చంద్రబాబు మోసగాడు

రెండు రూపాయలకు కిలో బియ్యం ఇస్తామని ప్రజలకు వాగ్దానం చేసి అధికారాన్ని చేపట్టిన తెలుగుదేశం ప్రభుత్వం నేడు బియ్యాన్ని 5.50 పైసలకు పెంచి ప్రజలను మోసగించింది. కరెంటు ఛార్జీలను విపరీతం చేసి సామాన్య, మధ్యతరగతి, రైతుల నడుం విరగగొట్టింది. నిత్యావసర వస్తువుల ధరలు కేంద్ర ప్రభుత్వం పెంచిందని అందువల్ల తమ నిరసనను సుతిమెత్తగా తెలియజేస్తామని ముఖ్యమంత్రి ప్రకటించడం ప్రజలను వంచించడమే. మాయమాటలు చెప్పి ప్రజలను మోసగిస్తున్న చంద్రబాబు నాయుడికి రాబోయే స్థానిక సంస్థల ఎన్నికల్లో తగిన బుద్ధి చెప్పకుంటే ఆయన చేష్టలు మితిమీరి పోతాయి.

గంగవరం జి. రామకృష్ణప్రసాద్

### గ్రామీణ పరిశ్రమలు నెలకొల్పాలి

రోగ నిర్ణయం జరిగాకే రోగికి వైద్యం చేయాలి. నేడు మన దేశాన్ని పట్టి పీడిస్తున్న పెద్ద రోగం నిరుద్యోగం. ఆకలికి మందు ఆహారమే. నిరుద్యోగ రక్కసి కోరలు

తరువా 10వ పేజీలో

# దొంగసొత్తులో ఫిఫ్టీ, ఫిఫ్టీ!

నెల్లూరు సెంట్రల్ క్రైం స్టేషన్ (సిసి ఎస్)లో పనిచేస్తున్న కానిస్టేబిళ్లు విధి నిర్వహణను తిని ప్రక్కన పెట్టి, స్వంత ఆస్తులు సమకూర్చుకోవడంలో భాగంగా దొంగలతో చేస్తంగట్టి, దొంగతనాలను ప్రోత్సహిస్తూ లక్షాధికారులయ్యారు. ఇక్కడ పని చేస్తున్న కానిస్టేబిళ్లకు ఏళ్ల తరబడి బదలీలు లేకపోవడం వల్ల ఇక్కడే పాతుక పోయారు. ఈ యేడాది టౌన్‌లో 40పైగా దొంగతనాలు జరిగి 20లక్షల రూపాయల మేర ప్రజల సొమ్మును దొంగలు దోచుకెళ్లినా సిసిఎస్‌లో పని చేసే కానిస్టేబిళ్లు ఒక్క రూపాయి కూడా తిరిగి రికవరి చేయలేక పోయారు. దొంగలతో

## లక్షాధికారులైన క్రైం పోలీసులు

వీరికున్న స్నేహం బాగా ధృడమై పోవడంతో రికవరీ చూపించక, పోలీసులే స్వంతంగా రికవరీలు చేసుకొని తమలో తాము భాగాలు పంచుకొంటున్నట్లు తెలిసింది. ఈ విషయం తెలిసే నెల్క్రితం పట్టణ డిఎస్పీ సిసిఎస్‌కు తాళాలు వేయించి,సంచలనం సృష్టించారు. సిసిఎస్‌లో పనిచేసే కానిస్టేబిళ్లలో ఒకరికి రెండు బెంపోలు, మరొకరికి రెండు కార్లు, ఇంకొక కానిస్టేబిల్‌కు 13 ఆటోలున్నాయి. మిగతా వారికి వివిధ వ్యాపారా లున్నాయి. మఫ్టీలో డ్యూటీ నిర్వహించే వెసలుబాటు ఉండడంతో పూటకోసారి స్టేషన్ వైపుకు రావడం ఏదో ఒక రికవరీకి వెళ్తున్నట్లు చెప్పి వెళ్లి కానిస్టేబిళ్లు స్వంత వ్యాపారాలు చూసుకోవడం రివాజయ్యింది. ఇక్కడ పని చేసే కానిస్టేబిళ్లు రెండు గ్రూపులుగా మారి ఒక గ్రూపు బంగారు అంగళ్లను, మరో గ్రూపు ఇనుప అంగళ్లను పంచుకొంది. దొంగతనాలు జరిగాయని రిపోర్ట్ రాగానే ఎవరో ఒక పిక్ ప్యాకెటర్‌ని బంగారు షాపుల వద్దకు తీసుకెళ్లడం అక్కడే అమ్మినట్లు చెప్పించడం కొంత మొత్తంలో బంగారు రికవరీ చేయడం దాన్ని పంచుకోవడం అలవాటుగా చేసుకొన్నారు. దీనివల్లే గ్రాము బంగారాన్ని కూడా కొత్త ఎస్‌పి వచ్చే వరకు ఈ స్టేషన్‌లో రికవరీ చూపించక పోవడం విశేషం. ఇటీవల రంగనాయకుల పేటలో పెళ్లి చేసుకొంటుండిన ఒక ఇనుప వ్యాపారి వద్దకు వెళ్లి పెళ్లి పీటల మీదనే వారిని అరెస్ట్ చేస్తామని సిసిఎస్ పోలీసులు బెదరించగా, పరువు కోసం అతను 40వేల రూపాయల మొత్తం స్టేషన్‌లో పనిచేసే ఇనుప అంగళ్ల బ్యాచ్ వ్యవహారాలు చూసే కానిస్టేబిళ్లకు సమర్పించినట్లు తెలిసింది. నెల్లూరు టౌన్ లోని కపాడిపాళెం, కప్పరాళ్లతిప్పలో దొంగతనాలకు పాల్పడే వారు తాము దొంగిలించిన మొత్తంలో సగం ఈ కానిస్టేబిళ్లకు వెనువెంటనే చేర్పించేస్తున్నారట. దీనివల్ల ఈ దొంగలు జిల్లాలోని ఏ స్టేషన్‌లోనైనా రెడ్

తరువ 11వ పేజీలో

రొట్టెల పండుగ సందర్భంగా బారాషహీద్ దర్గావద్ద పేదలకు అన్నదానం చేస్తున్న ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి, కౌన్సిలరు సల్మా, అనిత, పెంచలనరసింహం, శైలజ తదితరులు.

# అందరికీ కిరోసిన్ కూపన్లు అందేలా చేస్తా!

రేషన్‌కార్డున్న ప్రతి ఒక్కరికి కిరోసిన్ కూపన్లు అందేలా చూస్తామని నెల్లూరు ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి హామీ ఇచ్చారు. 17తేది తాను సృష్టించుకున్న ప్రజాపథం కార్యక్రమంలో భాగమైన ప్రజాసన్నిధిలో నెల్లూరు మండల కార్యాలయాన్ని సందర్శించి ప్రజల నుంచి వినతి పత్రాలు స్వీకరించారు. ఈ సందర్భంగా కిరోసిన్ కూపన్ల కోసం తాము పడుతున్న బాధలు కొందరు ఎమ్మెల్యే దృష్టికి తీసుకెళ్లారు. వెంటనే ఈ విషయమై వివేకానందరెడ్డి, ఎమ్మార్వోతో మాట్లాడి ఈ కూపన్ల పంపిణీ వ్యవహారమై నెలకొని వున్న కొన్ని చికాకులను తొలగించారు. ఎమ్మెల్యే చెప్పాక కార్డు పోయిన వారికి కూపన్లు ఇచ్చారు.

## ప్రజాసన్నిధిలో వివేకా వాగ్దానం

పోయిన సంవత్సరం కూపన్లు తీసుకోనని వారికి ఈ సంవత్సరం కూపన్లు ఇవ్వమనగా ఆ సమస్యనూ పరిష్కరించారు. కిరోసిన్ కూపన్లు తీసుకొనేందుకు గడువును మే 6తేది నుంచి అదనంగా మరో వారం రోజులకు పెంచారు. ఎమ్మార్వో ఆఫీసు వద్దనే గాక టౌన్‌లో వివిధ చోట్ల ఈ కూపన్లు ఇవ్వాలని ఈ విషయమై ఈనెల 22తేది జరిగే జిల్లా అభివృద్ధి మండలి సమావేశంలో చర్చించి ఒక పరిష్కారం కనుగొంటానని ఎమ్మెల్యే ప్రజలకు హామీ యిచ్చారు. ఈ కార్యక్రమంలో మునిసిపల్ వైస్ ఛైర్మన్ సందానిబాషాతో పాటు కాంగ్రెస్ పార్టీ కౌన్సిలర్లు పాల్గొన్నారు.

తరువ 11వ పేజీలో

# రొట్టెలపండుగకు ఇసకేస్తే రాలని జనం - వసతులు మాత్రం పూజ్యం!

ఈ యేడాది మూడు రోజుల పాటు బారాషహీద్ దర్గా వద్ద జరిగిన రొట్టెల పండుగకు లక్షలాది మంది భక్తులు తరలి వచ్చారు. పక్క రాష్ట్రాలైన తమిళనాడు, కేరళ, ఒరిస్సాలతో పాటు కడప, కర్నూల్, ఒంగోలు, హైదరాబాదు ప్రాంతాల నుంచి వేల సంఖ్యలో అన్ని మతాలకు చెందిన భక్తులు భక్తిశ్రద్ధలతో పండుగలో పాల్గొనడం చూసే వారికి కన్నుల పండుగలా తోచింది. భక్తుల సౌకర్యార్థం మూడు రోజులకు పొడిగించిన పండుగలో 17, 19తేదిల కన్నా 18తేది ఇసకేస్తే రాలనంత మందితో దర్గా పరిసర ప్రాంతాలు కిటకిటలాడాయి. ఎండలు విపరీతంగా వుండినా ఊహించని విధంగా చల్లని గాలులు వీయడంతో వడ దెబ్బ తగిలి పడినవారి సంఖ్య తక్కువే.

పండుగకు వచ్చే భక్తులు ఏటువంటి అసౌకర్యం కల్గకుండా బ్రహ్మాండ్ ఏర్పాట్లు చేస్తామని ఎమ్మెల్యే, మునిసిపల్ ఛైర్మన్, పెరేడ్ గ్రౌండ్‌లోని చెట్ల క్రింద తలదాచుకోవాల్సి వచ్చింది. రొట్టెలు మార్చుకొనే మహిళలు చెరువులో స్నానాలు చేసి బట్టలు మార్చుకొనేందుకు అవసరమైన డ్రెస్సింగ్

## మాటలకే పరిమితమైన నేతలు - హుండీలపైనే దృష్టి నిలిపిన వక్ఫ్ అధికారులు

ఆర్డీవో, ఎమ్మార్వో ప్రకటించారేగాని ఏవరికి అంతంత మాత్రంగానే చేశారు. చాలినన్ని షామియానాలు వేయక పోవడం వల్ల భక్తులు చెట్ల క్రింద, దర్గా సమీపంలో ఆఫీసర్స్ క్లబ్, దూరదర్శన్ రిలే కేంద్రం, పోలీస్ రూమ్స్ ఏర్పాట్లు చేయలేక పోయారు. తాత్కాలిక మరుగుదొడ్లు తగినన్ని లేవు. భక్తులు చెరువు దగ్గరకొచ్చే మార్గంలో వున్న పెద్ద గుంటలను మట్టితో పూడ్చే ప్రయత్నం చేయలేదు. దారిలో వున్న కరతుమ్మ చెట్లను సైతం నరికించక బయటి ప్రాంతాల నుంచి వచ్చేవారి ముందు నెల్లూరు పరువు పొయ్యేలా చేశారు. ఎండకు భయపడి సాయంత్రంపూట రొట్టెలు వదలను వెళ్లిన భక్తులు చిమ్మ చీకట్లో దేబూచులాడవల్సిన పరిస్థితి దాపురించింది. చెరువు వద్ద ఒక వరుసలోనే ట్యూబులైట్లు, అక్కడక్కడా మాత్రమే నియాన్ లైట్లను వేసి అధికారులు చేతులు దులుపుకొన్నారు. చిన్మయామిషన్, డివైఎఫ్ఐ, ఎఐఎడియంకె, కౌన్సిలర్ పిండి సురేష్‌లతో పాటు పలువురు స్వచ్ఛందంగా చలివేంద్రలు ఏర్పాటు చేశారు కాబట్టి సరిపోయింది కానీ, మునిసిపాలిటీ చలివేంద్రలను నమ్ముకొని వుంటే సగం మంది జనం దాహార్తికి అల్లాడేవారు. వక్ఫ్, దర్గా కమిటీల్లో ఎవరు దర్గా ప్రాంగణమంతా అంగళ్లు పెట్టుకొనే దానికి అనుమతించారేగాని, వచ్చే లక్షలాది మంది నడిచేందుకు దారిలేక పడేపాట్లను వాళ్లు గమనించలేక పోయారు. దర్గాలోనికి వెళ్లే 'క్యూ' కూడా విశాలంగా లేకపోవడం వల్ల ఇరుకుకు అల్లాడి పోవాల్సి వచ్చింది. వక్ఫ్‌బోర్డు నుంచి ప్రత్యేకంగా ఏర్పాట్లు చేయడానికి వచ్చిన ఇన్స్పెక్టర్లు తమ డ్యూటీ మాని హుండీల్లో డబ్బులు వేయమని భక్తుల ప్రాణాలు తీయడం అసహ్యంగా వుంది. 18తేది సాయంత్రం చీకటి పడ్డాక రొట్టెలు వదులుతున్న భక్తులపై పోలీసులు లాఠీ

తరువ 11వ పేజీలో



# ప్రక్కప్రక్కనే అంబేత్కర్ భవనాలెందుకు?

నెల్లూరు టౌన్ ఉమ్మారెడ్డి గుంటలోని ప్రభుత్వ స్థలంలో 50లక్షల రూపాయలు వెచ్చించి కొత్తగా నిర్మించే అంబేద్కర్ భవన్ భవనానికి ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి 14తేది శంకుస్థాపన చేశారు. ఈ సందర్భంగా మంత్రి మాట్లాడుతూ భవన నిర్మాణానికి ప్రభుత్వం 25లక్షలు ఇస్తుందని, మిగతా ధనం ప్రజల నుండి సేకరిస్తామన్నారు. అంబేద్కర్ భవన్ కట్టాలని నిర్ణయించుకొన్న ప్రాంతాన్ని దురాక్రమించి వున్న వారికి మరోకచోట ప్రభుత్వ స్థలాన్ని కేటాయించి నివాస పట్టాలివ్వాలని జిల్లా కలెక్టరును మంత్రి ఆదేశించారు. ఈ కార్యక్రమంలో నెల్లూరు ఎమ్పీ డాక్టర్ ఉక్కాల రాజేశ్వరమ్మ, నెల్లూరు, సూళ్లూరుపేట, ఉదయగిరి శాసనసభ్యులు ఆనం వివేకానందరెడ్డి, పరసా రత్నం, విజయరామిరెడ్డి తదితరులు పాల్గొన్నారు. అంబేద్కర్

## నెల్లూరుసంగతులు

భవన్ చెంతనే మరో అంబేద్కర్ భవన్ ఎందుకు నిర్మిస్తున్నారో, దీనికి అవసరమైన నిధులు 25లక్షలు ప్రజల సొమ్ము దుర్వినియోగం చేస్తూ, కొరవ 25లక్షలు ఎవరు ఏ విధంగా వసూలు చేస్తారో స్పష్టం

తరువ 11వ పేజీలో

# వైస్ ఛేర్మన్ కుర్చీపై కోరిక పెంచుకున్న కౌన్సిలర్లు!

మునిసిపల్ ఎన్నికలు అయిపోయి నెల గడిచినా కావలిలో వైస్ ఛేర్మన్ అభ్యర్థి విషయమై కాంగ్రెస్ పార్టీలో మల్లగుల్లాలు పడుతున్నారు. కావలి మున్సిపాలిటీలో ఛేర్మన్‌ను మినహాయిస్తే, 16 మంది కాంగ్రెస్ కౌన్సిలర్లున్నారు. సునాయాసంగా వైస్ ఛేర్మన్ పదవి కాంగ్రెస్‌కే దక్కుతుంది. అయితే ఈ పదవికి పోటీదారులు ఎక్కువై పోయారు. మాజీ ఎమ్మెల్యే యానాదిరెడ్డి, ఛేర్మన్ గ్రంధి యానాదిశెట్టి ఎంత ప్రయత్నిస్తున్నప్పటికీ కాంగ్రెస్ కౌన్సిలర్లను ఏకాభిప్రాయానికి తీసుకొని రాలేక పోతున్నారు. ఈ నెల 10 తేది మునిసిపల్ సమావేశం జరగ్గా విచిత్రంగా కాంగ్రెస్ కౌన్సిలర్లందరూ గైర్హాజరయ్యారు. వైస్ ఛేర్మన్‌కు ఎన్నికగాని జరిగితే కాంగ్రెస్ కౌన్సిలర్లు, తెలుగుదేశానికి క్రాస్ ఓటింగ్ చేస్తారని భయపడి, అధినాయకులు అందరూ గైర్హాజరయ్యేలా చేశారు. కాంగ్రెస్ పార్టీలో మొత్తం ఎనిమిది మంది కౌన్సిలర్లు వైస్ కోసం పోటీపడుతుండగా యానాదిరెడ్డి, యానాదిశెట్టి చేసిన కృషి వల్ల పోటీలో చివరికి ముగ్గురు మిగిలారు. దళితుల తోపాటు, మాజీ వైస్‌పర్సన్ చలంచర్ల దేవసేనను కూడా పోటీ నుంచి అతికష్టం మీద తప్పించారు. ప్రస్తుతం 15వవార్డు కౌన్సిలర్ సున్నా వెంకట్రావు మూడుసార్లు కౌన్సిలర్‌గా గెలిచానని అందువల్ల వైస్ ఛేర్మన్ పదవి తనకే యివ్వాలని పట్టుబడుతున్నారు. అలాగే మొదటిసారి భారీగా ధనం ఖర్చు చేసి గెలిచిన 26వార్డు కౌన్సిలర్ గంటువర్లి రాజ్ కుమార్ చౌదరి తనకు ఈ అవకాశం ఇవ్వాలని వాదిస్తున్నాడు. మైనారిటీ కోటాలో తనకు 'వైస్' కుర్చీని అప్పగించాల్సిందిగా 22వార్డు కౌన్సిలర్ పఠాన్ నవాజ్‌ఖాన్ పట్టుబడుతున్నాడు. 10వతేది జరిగిన మున్సిపల్ సమావేశంలో కాంగ్రెస్ కౌన్సిలర్లు గైర్హాజరవ్వడంతో కోరం లేకుండా సమావేశం ముగిసిపోయింది. కోరం లేకుండానే ఎక్స్‌అఫిషియో సభ్యునిగా ఎమ్మెల్యే వంటేరు వేణుగోపాల

## రెండుసార్లు ఎన్నిక వాయిదాకు కారణమిదే!

రెడ్డి ప్రమాణం చేయగా, దేశం కౌన్సిలర్లు 10మంది, బిజెపి కౌన్సిలర్లు యిద్దరు వెనుతిరిగి పోయారు. తొలి మునిసిపల్ సమావేశం ప్రారంభానికి ముందు రోజు రాత్రి, యానాదిరెడ్డి ఎన్నికల అధికారిగా వుండి వైస్ ఛేర్మన్ అభ్యర్థిని సూచించమని కాంగ్రెస్ కౌన్సిలర్లచే తన ఇంట రహస్య ఓటింగ్ జరిపించారు. సున్నా వెంకట్రావుకు 9 ఓట్లు రాగా, రాజ్‌కుమార్ చౌదరికి 5 ఓట్లు, నవాజ్‌ఖాన్‌కు 1 ఓటు వచ్చినట్లుగా తెలిసింది. ఒక కౌన్సిలర్ ఊరిలో లేనందున ఓటింగ్‌కు రాలేక పోయాడు. దాంతో యానాదిరెడ్డి, యానాదిశెట్టి అయోమయంలో పడిపోయారు. ఈ పరిస్థితిలో ఓటింగ్ జరిగితే 6మంది కాంగ్రెస్ కౌన్సిలర్లు 'దేశం'కు ఓటు వేయవచ్చని భావించి, సమావేశానికి గైర్హాజరయ్యేలా చేశారు. కాంగ్రెస్‌లో గొడవలు తమకు అనుకూలంగా మలుచుకోవడానికి 'దేశం' ప్రయత్నాలు ప్రారంభించినా అందులో సఫలం కాలేక పోయారు. వంటేరు హైదరాబాదుకు వెళ్లిపోవడం, పట్టణ అధ్యక్షునికి, వంటేరుకు సయోధ్య లేకపోవడం చేత, 'దేశం' కౌన్సిలర్లు అయోమయంలో పడిపోయారు. 'దేశం' వైస్ అభ్యర్థిగా చక్కా నరసింహంను అనుకోగా, కాంగ్రెస్‌లో ఏర్పడిన పరిణామాల కారణంగా ఆయన కూడా డైలమాలో పడిపోయాడు. ఏది ఏమైనా మెజారిటీ వుండి కూడా అంతర్గత విభేదాల మూలంగా వైస్ ఛేర్మన్‌ను ఎన్నుకోలేక కాంగ్రెస్ పార్టీ పరువు పోగొట్టుకున్నది.

## లంచం ఇవ్వకుంటే పనిచేయడం లేదు

ఉదయగిరి, సీతారాంపురం మండలాల వ్యవహారాలు చూస్తే విద్యుత్ సెక్షన్ ఆఫీసరు లంచం ఇవ్వనిదే మంచం ఎక్కనంటున్నాడు. విద్యుత్ సమస్యకు సంబంధించి రైతులు చిన్న అవసరం వచ్చి సంప్రదించినా పనిని బట్టి లంచం రేట్ల టారిఫ్ చెప్తా

తరువాయి 7వ పేజీలో



నెల్లూరులోని రవి చిన్నపిల్లల ఆసుపత్రి ఇందుకూరుపేటలో నిర్వహించిన వైద్య శిబిరంలో ప్రసంగిస్తున్న డాక్టర్ రవి, ప్రక్కన డాక్టర్ సతీమణి వసంత లక్ష్మి, ఆర్డీఓ వెంకటేశ్వర్లు, జాయింట్ కలెక్టర్ దాసరి కార్మియల్, ఎమ్మార్వో వున్నారు

## మెట్టరైతులను ముంచిన గాలివాన

ప్రతిరోజూ పత్రికలలో చూస్తున్నాం. ఇక్కడ అతిసారా అక్కడ మెదడు వాపు - ఇంకో చోట తెలియని అనారోగ్యం వేరొకచోట వైరల్ ఫీవర్. ఇందుకు తదధికార్ల ప్రెస్ స్టేట్‌మెంట్లు. తాము యుద్ధప్రాతిపదికలతో వాటిని తరిమి కొడుతున్నామంటున్నారు. వాస్తవానికి అనారోగ్యానికి కారణాలు కనుక్కొని వాటి నిర్మూలనకు ప్రయత్నం చాల్సింపోయి వచ్చిన తర్వాత పథకాలు తయారు చేయడం గొప్పలకొరకు ఫోటోలు తీసుకొని పత్రికలలో వేయించుకోవడం అధికార్లకు మామూలై పోయింది. ఏ మార్కెట్టైనా పోండి - అది కూరగాయల మార్కెట్‌గాని, చేపల మార్కెట్‌గాని ఒక్కచోటైనా పరిశుభ్రంగా వుంటోందా? గబ్బు - గబ్బు. పరిరక్షించాల్సిన వారు తమ ధర్మాన్ని నెరవేరుస్తున్నారా? గుండె మీద చెయ్యివేసుకొని చెప్పమనండి ఒక్కరైనా ఆ రకంగా తమ విధిని నిర్వర్తిస్తున్నామని; ఇందుకు లేదనే సమాధానం వస్తుంది.

నెల్లూరు టౌన్ చేపలు, మాంసం మార్కెట్ దగ్గరకు పోండి. కోళ్లు కోసి వ్రేలాడ

## జిల్లావార్తలు

దీసి వుంటారు. ఎప్పుడు కోశారు? ఎన్ని గంటలైంది? అవి చెడిపోకుండా ఎంతకాలం వరకు అలా వుంచవచ్చు. అదేమీ లేదు. ప్రొద్దుటి నుంచి సాయంకాలం వరకు కోడి మాంసం మీద నీళ్లు చల్లుతూ అమ్ముతూనే వుంటారు. వీటినికొని తింటే అతిసార వస్తుంది. తెలియని జబ్బులు దారి చేస్తాయి. ఈ

తరువాయి 8వ పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు
[illegible]

## జిల్లాకు కరవు నిధులు 4.25 కోట్లు

జిల్లాలో ప్రస్తుతం నెలకొనివున్న కరవు పరిస్థితులను ఎదుర్కొనేందుకు 4.25 కోట్ల రూపాయలు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు విడుదల చేశారు. జిల్లా మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి అభ్యర్థన మేరకు పరిస్థితులను స్వయంగా సమీక్షించి ముఖ్యమంత్రి ఈ మేరకు మంజూరుకు ఉత్తర్వులిచ్చారు. ఈ నిధులలో జిల్లాలో ఉపాధి హామీ పథకాల అమలుకు, చెరువుల మరమ్మత్తులకు 2కోట్ల రూపాయలు, రైతులకు ఎరువులు, విత్తనాల సబ్సిడీ అందజేసేందుకు 95లక్షలు, గ్రామీణ ప్రాంతాల్లో మంచినీటి ఎద్దడి నివారణకు 70లక్షలు, పట్టణ ప్రాంతాల్లో 60లక్షల రూపాయలను ఈ నిధుల్లో వినియోగిస్తారు. జిల్లా అభివృద్ధి సమావేశం 22తేది జరుగుతుండగా, 20తేది నిధుల మంజూరుకు ఉత్తర్వు లివ్వడం విశేషం.

## రంగడి రాజగోపురం జీర్ణోద్ధరణ

నెల్లూరు తల్పగిరి రంగనాథస్వామి ఆలయానికి తూర్పువైపున వున్న రాజగోపురానికి జీర్ణోద్ధరణ కార్యక్రమాలు ఈ రోజు (21తేది) మొదలయ్యాయి. రాజగోపురం శిధిలావస్థకు చేరుకోవడంతో 20లక్షల రూపాయల వ్యయంతో ఈ జీర్ణోద్ధరణను చేయిస్తున్నారు. మైసూరులోని మేల్కోట ఆగమాచార్యులు సంపత్కుమార భట్టర్ స్వామి ఈ కార్యక్రమానికి నేతృత్వం వహించారు.

## పెద్దాసుపత్రిలో అదనపు సౌకర్యాలు

నెల్లూరు పెద్దాసుపత్రిలో కొత్తగా నిర్మించిన ఎమర్జెన్సీ బ్లాక్, ఆపరేషన్ థియేటర్లు, రోగులుండే ప్రత్యేక గదుల సముదాయాన్ని 22తేదీ ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకర రెడ్డి ప్రారంభిస్తారు. పెద్దాసుపత్రిలో గతంలోనే వెంటిలేటర్‌తోపాటు ఇతర అత్యాధునిక సౌకర్యాలు అందుబాటులో వున్నాయని, అధికారులు ప్రకటిస్తున్నారేగాని, రక్తపరీక్ష చేసేందుకు కావాల్సిన డిస్పోజబుల్ సిరంజీలు, నీడిల్స్, స్పిరిట్ కూడా రోగులకు అందుబాటులో లేని దౌర్భాగ్య పరిస్థితి నెడుంది. పెద్దాసుపత్రిలో సౌకర్యాలు మెరుగుపర్చే బాధ్యత కొత్త సూపరింటెండెంట్ డాక్టర్ కె. జీవన్ స్వీకరించాలి.

## ముగ్గురు మంత్రులు

రాష్ట్ర మంత్రులు ముగ్గురు జిల్లాలో పర్యటించనున్నారు. జిల్లా ఇన్‌ఛార్జి మంత్రి చిక్కాల రామచంద్రరావు తిరుమల ఎక్స్‌ప్రెస్‌లో 22తేదీ నెల్లూరు వచ్చి జిల్లా అభివృద్ధి మండలి సమావేశంలో పాల్గొని, రాత్రి సర్కార్ ఎక్స్‌ప్రెస్‌లో భీమవరానికి వెళ్తారు.

దేవాదాయ శాఖామంత్రి దండు శివరామరాజు తిరుమల ఎక్స్‌ప్రెస్‌లో 23తేదీ నెల్లూరులో దిగి వెంకటగిరి వెళ్లి టిటిడి కళ్యాణ మండపాన్ని ప్రారంభించి రాత్రి నారాయణాద్రి ఎక్స్‌ప్రెస్‌లో హైదరాబాద్ వెళ్తారు.

ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి 22తేదీ నెల్లూరు వచ్చి, జిల్లా అభివృద్ధి మండలి సమావేశం తోపాటు వివిధ కార్యక్రమాల్లో పాల్గొంటారు. 23తేదీ వెంకటగిరిలో పర్యటిస్తారు.

## ఎమ్మెల్యే ప్రభాకరరెడ్డి నిధులు

రాజ్యసభ సభ్యుడు, నెల్లూరీయుడు, పర్వతనేని ప్రభాకరరెడ్డి తన ఎమ్మెల్యే కోటాలో 35లక్షల రూపాయల నిధులను జిల్లాకు కేటాయించారు. జిల్లా కలెక్టర్ అభ్యర్థన మేరకు ఏసి సుబ్బారెడ్డి స్టేడియంలో నిర్మించే ఇండోర్ స్టేడియంకు 25లక్షలు, నెల్లూరు ఎమ్మెల్యే డాక్టర్ రాజేశ్వరమ్మ కోరిన మీదట నెల్లూరు జూబ్లీ హాస్పిటల్ అభివృద్ధికి 10లక్షలు కేటాయించారు.

ప్రభాకర్‌రెడ్డి ఎమ్మెల్యే అయిన తొలినాళ్లలో తన కోటాలో విడుదలైన నిధుల్లో కొంత మొత్తాన్ని స్వంతమండలమైన అల్లూరు ప్రాంత అభివృద్ధికి వెచ్చిస్తానని వాగ్దానం చేశారు. కాని ఇంత వరకు ఆయన కోటా నిధులతో అభివృద్ధి పనులు మొదలే కాలేదు. జన్మభూమిని మర్చిపోతే ఎలా ఎమ్మెల్యేగారు?

## నెల్లూరు విద్యార్థి ప్రతిభ

హైదరాబాద్‌లోని యూనిఫైడ్ కౌన్సిల్ ఫిబ్రవరి 6తేదీన నిర్వహించిన రాష్ట్రస్థాయి సైన్స్ టాలెంట్ టెస్ట్‌లో నెల్లూరు ఎస్ఆర్‌కె స్కూల్‌లో ఏడవ తరగతి చదివే విద్యార్థి ఎం.ఆర్. కాశ్యప్ రాష్ట్ర స్థాయిలో 8వ ర్యాంకు పొందారు. కాశ్యప్ ప్రతిభను ప్రశంసిస్తూ రాష్ట్ర విద్యాశాఖా మంత్రి కడియం శ్రీహరి ప్రత్యేక అవార్డును బహూకరించారు. గతంలో హైదరాబాద్‌లోని విశ్వభారతి అకాడమీ, సూళ్లూరుపేటలోని యునైటెడ్ ప్రోగ్రెసివ్ ఫోరం నిర్వహించిన సైన్స్ టాలెంట్ టెస్ట్‌లలో కాశ్యప్ ప్రథముడిగా వచ్చాడు. కాశ్యప్ తండ్రి డాక్టర్ ఎం. సుబ్రహ్మణ్యం, నెల్లూరు విఆర్ కాలేజీలో ఫిజిక్స్ లెక్చరర్‌గాను, తల్లి రజని ఎస్ఆర్‌కె స్కూల్‌లో సైన్స్‌టీచర్‌గాను పని చేస్తున్నారు. టాలెంట్ టెస్టుల్లో జిల్లా పేరు నిల్పుతున్న చిన్నారికి మా అభినందనలు.

## సిసిఎస్ నాగేశ్వరరావు వలలో పెద్ద చేప

ఇటీవల సెంట్రల్ క్రైం స్టేషన్ ఇన్‌ఛార్జి బాధ్యతలు స్వీకరించిన ఆర్. నాగేశ్వరరావు తన తొలి ప్రయత్నంలోనే పెద్ద దొంగను 20తేదీ అరెస్టు చేశారు. అతని వద్ద నుంచి 20 సవర్ల బంగారును స్వాధీనం చేసుకొన్నారు. తమిళనాడుకు చెందిన తంగరాజ్ అనే గజదొంగ 20తేదీ నెల్లూరు ములుమూడి బస్టాండ్ వద్ద అనుమానాస్పదంగా తిరుగుతుండగా, అటువైపుగా డ్యూటీ మీద వెళ్లిన నాగేశ్వరరావు కంటబడ్డాడు. అనుమానంతో అదుపులోకి తీసుకోగా అతని వద్ద 20 సవర్ల బంగారం దొరికింది. విచారించగా జనవరి 23తేదీ మైపాడు గేటు ప్రాంతంలోని అరవింద్ నగర్‌లో నివాసముంటున్న ఆర్టీసి క్లర్క్ పి. వెంకటసుబ్బయ్య యింట్లో దొంగిలించినట్లు ఒప్పుకొన్నాడు. తంగరాజ్‌ను నెల్లూరు క్రైం పోలీస్ స్టేషన్ పోలీసులు 1990లో ఒక దొంగ తనం కేసులో అరెస్ట్ చేసి కోర్టుకు హాజరుపర్చగా, బెయిల్‌పై బయటకు వచ్చి వాయిదాలకు హాజరుకాకుండా తప్పించుకు తిరుగుతున్నాడు. నవాబుపేట, బాలాజీ నగర్‌లో జరిగిన పలు దొంగతనాల్లో తంగరాజ్‌కు ప్రమేయమున్నట్లు సిసిఎస్ ఇన్‌ఛార్జి నాగేశ్వరరావు చెప్పారు.

## బాలేందర్ సింగ్‌కు పోలీసు సేవాపతకం

రాష్ట్ర ప్రభుత్వం ఉగాది సందర్భంగా ప్రకటించిన 'ఆంధ్రప్రదేశ్ పోలీస్ సేవాపతకాన్ని' నెల్లూరు అవినీతి నిరోధక శాఖలో హెడ్‌కానిస్టేబుల్‌గా పనిచేస్తున్న బి. బాలేందర్ సింగ్ అందుకున్నారు. సివిల్ పోలీసుగా పనిచేస్తున్న బాలేందర్ సింగ్‌ను 1994లో ఎసిబిలోకి డిప్యూటేషన్‌పై తీసుకొన్నారు. విధి నిర్వహణలో విశిష్ట ప్రతిభ చూపినందుకు గతంలో 3 జి.ఎస్.ఇ, 18 నగదు రివార్డులు బాలేందర్ సింగ్ పొందారు. ఎసిబి డిఎస్పి డి.వి.ఎస్.ఎస్. మూర్తి, బాలేందర్ సింగ్ ప్రతిభ గుర్తించి పోలీస్ సేవా పతకాన్ని ఇవ్వమని ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపారు.

## హైకోర్టులో రెండవ పంట నీటి విషయం

జిల్లాలోని పెన్నార్ డెల్టా రైతులకు రెండవ కారుకు నీటిని విడుదల చేయాలని పెన్నార్ డెల్టా రైతాంగ కమిటి హైకోర్టులో దాఖలు చేసిన పిటీషన్‌పై 20తేదీ వాదనలు జరిగాయి. ఈ విషయంపై రాష్ట్ర ప్రభుత్వం తన స్పష్టమైన నిర్ణయాన్ని తెలపాలని హైకోర్టు ఫుల్‌బెంచి, ప్రభుత్వానికి 26తేది వరకు గడువిచ్చింది.

## విశ్వజన జాగరణ రథయాత్ర రాక 23న

విశ్వ గాయత్రి పరిషత్ శాంతికుంజ్ - హరిద్వార్, 21వ శతాబ్ది ఉజ్వల భవిష్యత్ కోసం నిర్వహిస్తున్న విశ్వజన జాగరణ రథయాత్ర 23తేదీ నెల్లూరు వస్తుంది. ఈ సందర్భంగా కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంక్ ఆవరణలో ప్రదర్శనకు పెట్టి కలశాన్ని టౌన్‌లో వూరేగిస్తారు. జిల్లా కలెక్టర్, ఎస్పి కూడా ఈ కార్యక్రమంలో పాల్గొంటారని నిర్వాహకులు చెప్పారు.

## వెంకయ్య పంతులు సత్రం దుర్వినియోగం

నెల్లూరుటౌన్ ఉస్మాన్ సాహెబ్‌పేట రేబాల వారి సందులోని ఆయలూరువెంకయ్య పంతులు సత్రం ఎవరైనా బ్రాహ్మలు స్వర్గస్థులైనప్పుడు వారి భౌతికాయాన్ని సత్రంలో

తరువాత 7వ పేజీలో

## వైస్ కుర్చీ

5వ పేజీ తరువాయి

విప్పుతున్నాతని సర్వత్రా విమర్శలు వినవస్తున్నాయి. గతంలో ఈ రెండు మండలాలలో అదే బాధ్యతలు నిర్వహిస్తూ, ప్రస్తుతం ప్రకాశం జిల్లా కనిగిరికి బదిలీపై వెళ్లిన అధికారి చెప్పు చేతల్లో కీలుబొమ్మగా మారిన సదరు ఉద్యోగి, తన బాధ్యతలన్నీ ఆయనకు అప్పచెప్పి, ఆయనిచ్చే ఆదేశాల మేరకు వ్యవహరిస్తున్నాడు. విద్యుత్ కనెక్షనుకు పూర్తి డిమాంట్ ఏర్పడడంతో వీరి రొట్టె విరిగి నేతిలో పడినట్లయింది. ఎవరికి కనెక్షన్ అవసరం వచ్చినా కనిగిరికి బదిలీపై వెళ్లిన అధికారిని సంప్రదించడం ఆయన జాబితాలో చేతికి, కనెక్షన్ పొంది సక్రమంగా బిల్లులు చెల్లించక అపుదల చేసిన వాటి బకాయిలు చెల్లించడంతోపాటు విద్యుత్ అధికార్లకు 10వేల నుండి 15వేల వరకు కట్నం కానుకగా సమర్పించుకొన్న వెంటనే దొడ్డి దారిన కనెక్షన్ ఇవ్వడం ఈ కార్యాలయంలో నిత్యం జరుగుతున్న తతంగమే. ఇటీవల కాలంలో ఉదయగిరి, సీతారాంపురం, వరికుంటపాడు మండలాల్లో 15 విద్యుత్ కనెక్షన్‌లు దొడ్డిదారిన సమకూర్చి లక్షన్నర వరకు జేబులు నింపుకొన్నట్లు వినికిడి. ఉదయగిరి మండలం గండిపాళెం బిసి, యస్‌సి కాలనీలోని ఇళ్లపై భాగాన ఉన్న విద్యుత్ లైను తొలగింపుకు ఇచ్చుకోలేనంత లంచం కానుకగా ఇవ్వమనడం అంత ఇచ్చుకోలేమని బాధితులు చెప్పడంతో అడిగినంత ఇచ్చినంత వరకు తాము లైను తొలగించడం కాదు కదా మరింత బాధలకు గురిచేస్తామని ప్రతిజ్ఞ చేసి ఈ ప్రాంతంలో ఒక ఇంటి ప్రక్కనే ట్రాన్స్‌ఫార్మర్ ఏర్పాటుకు సన్నద్ధం చేయగా స్థానికులు అడ్డుకున్నారు. ఈ విద్యుత్ అధికారుల అవినీతి దాహానికి అడ్డుకట్ట వేయకుంటే అనేక మంది రైతులు, ప్రజలు ... బాధితులుగా మిగలవలసి ...

ట్రస్ట్ తరపున త్వరలో మొబైల్ క్లినిక్‌ను ఏర్పాటు చేస్తున్నట్లు తెలిపారు. శిబిరంలో ఆసుపత్రి డాక్టర్లు 1000 మంది పిల్లలను పరీక్షించి, దాదాపు లక్షా 50వేల రూపాయల విలువ చేసే మందులు పంచిపెట్టారట. ట్రస్ట్ ఛైర్మన్ వసంతలక్ష్మి కూడా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### రవి ఆసుపత్రి ఉచిత వైద్య శిబిరం

నెల్లూరులోని రవి చిన్నల పిల్లల హాస్పిటల్ అనుబంధ సేవా సంస్థ వసంత లక్ష్మి ఛారిటబుల్ ట్రస్ట్ ఆధ్వర్యంలో ఇందుకూరుపేట ఎం.కె.ఆర్. హైస్కూల్‌లో 16తేది మెగా చిన్న పిల్లల ఉచిత వైద్య శిబిరం జరిగింది. వైద్య శిబిరాన్ని జాయింట్ కలెక్టర్ దాసరి కార్మియేల్ ప్రారంభించి మాట్లాడారు. సేవానిరతికి నిలువెత్తు సాక్ష్యాలు డాక్టర్ రవి, ఆయన సతీమణి వసంతలక్ష్మి అని ప్రశంసించారు. డాక్టర్ రవి కుమార్ మాట్లాడుతూ తమ ఆసుపత్రిలో వైద్యం అందరికీ అందుబాటులో ఉంటుందన్నారు.

## నెల్లూరు చరిత్ర

2వ పేజీ తరువాయి

మనుమసిద్ధిని పారద్రోలారు. రక్కస గంగడు అనేవాడు కడపను ఆక్రమించాడు. రాజ్య భ్రష్టుడైన మనుమసిద్ధిని తిరిగి గద్దె ఎక్కించడానికి, కవి తిక్కన సోమయాజి వరంగల్లు వెళ్లి, కాకతీయ గణపతిని కలిశారు. అప్పటికే తిక్కన ఖ్యాతి తెలుగుదేశం నాలుగు చెరగులా వ్యాపించి వుండింది. తిక్కన తమ నగరానికి రావడమే తమకు ఎంతో గౌరవంగా భావించాడు గణపతి దేముడు; వెంటనే ఒక గొప్ప సైన్యాన్ని, సామంత భోజుడి నేతృత్వంలో నెల్లూరుకు పంపాడు. వీరు నెల్లూరును తగులబెట్టి, దాన్ని ఆక్రమించి వుండిన బయ్యన, తిక్కనల తలలతో చెండాట ఆడి, మనుమసిద్ధికి రాజ్యం అప్ప చెప్పడమే కాకుండా, ఇంకా దూరం వెళ్లి చోళరాజు మూడవ రాజేంద్రుడ్ని హతం చేసి, ద్రావిడ రాజ్యం సమస్తం చేజిక్కించుకున్నారు. చెంగల్పట్టును ఆక్రమించి వుండిన గండగోపాలుడ్ని, అతడికి సాయం వచ్చిన కర్ణాటక రాజులను ఓడించారు. మనుమసిద్ధికి మళ్లీ కంచి నుంచి నెల్లూరు వరకు రాజ్యం దక్కింది అయితే దానితోనూ అతడి కష్టాలు తీరలేదు. కాకతీయ సైన్యం వెనక్కి మరలగానే, గండగోపాలుడు యుద్ధం చేసి, కంచిని తన స్వంతం చేసుకున్నాడు. మనుమసిద్ధికి మళ్లీ నెల్లూరు జిల్లా మాత్రం మిగిలింది. కడప జిల్లాను ఆక్రమించి వుండిన రక్కసి గంగడిని కూడా కాకతీయ సేనలు - గుత్తి వద్ద జరిగిన యుద్ధంలో ఓడించినా, కాకతీయ గణపతి ఈ ప్రాంతాన్ని మనుమసిద్ధికి ఇవ్వలేదు. గంగయ సాహిణికి అప్ప చెప్పాడు.

మనుమసిద్ధి మీద మమకారంతో తిక్కన తన రచనలలో - ఈ యుద్ధాలన్నీ మనుమసిద్ధి నిర్వహించాడని వ్రాశాడు. కాని అది నమ్మబుద్ధి కాని విషయం. కాకతీయులే ఈ విజయాలకు కారకులు.

(కొరవ పైవారం)

## ఎమ్మెల్యేలు

మొదటి పేజీ తరువాయి

ఇంటి పట్టునే వుండి పోతున్నారు.

ప్రతి ఒక్కరిలోనూ తమ పరిస్థితి పట్ల ఆక్రోశం వుంది, నలుగురు ఎమ్మెల్యేలు ఒకచోట చేరితే ఇదే చర్చ. కాని ఎవరిలోనూ దాన్ని బహిరంగంగా వెళ్లగక్కే ధైర్యం లేదు. అందరూ అవకాశం కోసం ఎదురు చూస్తున్నారు; పిల్లి మెడలో గంట కట్టే ఎలుక కోసం వెతుకుతున్నారు. చిన్న సందు దొరికినా వదలి పెట్టేందుకు ఎవరూ వెనుకాడరన్పిస్తున్నది - పరిస్థితి చూస్తుంటే; అది ఎప్పుడన్నదే ప్రశ్న!! *

## నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ తరువాయి

వుంచుకొని, స్మశానానికి తీసుకొనిపోవడం - కర్మక్రతువులు జరుపు కోవడానికి వీలుగా వుండేది. వెంకయ్య పంతులు ఇదే ఉద్దేశ్యంతో ఈ సత్రం నిర్మించారు. కాని సత్రం రెనోవేషన్ కమిటీ దీనికి విరుద్ధంగా ఆ ప్రాంతంలో కొట్లు కట్టి డబ్బు సంపాయించే ప్రయత్నం చేస్తున్నారు. దాత ఆలోచనలను అతిక్రమించే హక్కు కమిటీకి, దేవాదాయ ధర్మాదాయ శాఖకు లేదనుకొంటాం. టౌన్‌లో ఇప్పటికే ఇటువంటి సత్రాలు తక్కువై బ్రాహ్మలు ఇబ్బందులు పడుతున్నారు.

హైదరాబాద్‌లోని యునిఫైడ్ కౌన్సిల్ నిర్వహించిన రాష్ట్రస్థాయి సైన్స్ టాలెంట్ టెస్ట్‌లో రాష్ట్రస్థాయిలో 8వ ర్యాంకు పొంది విద్యాశాఖామంత్రి కడియం శ్రీహరి ద్వారా అవార్డు స్వీకరిస్తున్న నెల్లూరు ఎస్ఆర్‌కె స్కూల్ విద్యార్థి యం.ఆర్. కాశ్యప్.

## రమేష్

ఆఖరుపేజీ తరువాయి

ఘాతుకత్వంతో, నోటి దురుసుతనంతో నట్టేట ముంచిన తర్వాత రమేష్‌రెడ్డి మాటలు ఎవరు నమ్ముతారు? పరిస్థితి చాలా దూరం వెళ్లిపోయింది; పార్టీ బహిష్కారం లేదా సస్పెన్షన్ చాలా దగ్గరకు వచ్చేశాయి. చేజేతులా తన భవిష్యత్ తానే నాశనం చేసుకున్నాడు రమేష్‌రెడ్డి. మునిసిపల్ ఎన్నికల నుంచి ఆయన్ను రెచ్చగొట్టి, అందరినీ దగ్గరుండి తిట్టించిన సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఇప్పుడు ముఖం చాటేశాడు. రమేష్‌రెడ్డికి పార్టీ బహిష్కారం జరిగితే మాత్రం - శకుని పాత్రకు సర్వవిధాలా సరితూగేవాడిగా చంద్రమోహన్‌రెడ్డి కీర్తినందుతాడు. ప్రక్కనే వుండి - పతనం చేయించడమే కదా శకుని ప్రత్యేకత!

# వాస్తు బలం తగ్గి శ్రీకాళహస్తి వైభవం నాస్తి!

ఆదిశంకరాచార్యులు శ్రీచక్రప్రతిష్ఠ చేశారిక్కడ. శ్రీకాళహస్తిలోని 'వాస్తులేమి' శ్రీ చక్రం శక్తిని నిర్వీర్యం చేసింది.

### శ్రీకాళహస్తీశ్వరుడు పశ్చిమాభిముఖుడై వున్నాడు.

శ్రీకాళహస్తి వంటి శిల్పకళ శోభిత ఆలయం ఆంధ్రదేశంలో లేదంటే అతిశయోక్తి కాదు. చివరకు తిరుమల ఈ ఆలయం వైభవానికి ఏ మాత్రం చాలదు. అయినా శ్రీకాళహస్తి ఆలయవైభవం అంతంత మాత్రంగానే వుంది. కారణం వాస్తుపరమైన బలం లేక ఆలయ స్థలానికి ఆకర్షణ శక్తి లేకపోయింది. తూర్పు, ఈశాన్య ప్రాంతాలలో ఎత్తైయినపర్వత పంక్తులు ఆలయ వాస్తును బలహీనపరిచాయి. ఫలితంగా వందల ఎకరాల మాన్యాలున్నా, దాదాపు 40 సంవత్సరాలుగా నామమాత్రపు కౌలును చెల్లిస్తూ కొందరు పెత్తందారులు ఈ ఆస్తులను అనుభవిస్తున్నారంటారు.

ఆలయ నిర్మాణంలో కూడా జరిగిన అవాస్తు పద్ధతుల వల్ల శ్రీకాళహస్తి మామూలు క్షేత్రమై పోయింది.

### శ్రీశైల క్షేత్రంలో వాస్తు జైత్రయాత్ర!

శివక్షేత్రాలలో ఆరాధ్యమైన క్షేత్రం. శ్రీశైలం నల్లమల పర్వతారణ్యం ప్రాంతంలో పచ్చదనాల సిరుల పంటగా వెలసి భక్తజన సందోహ నీరాజనాలను అందుకుంటున్న శ్రీశైల మల్లన్న ఆలయానికి వాస్తు సిరి నిండుగా పుష్కలంగా వుండడం వల్ల సుప్రసిద్ధ క్షేత్ర రాజమై విరాజిల్లు తున్నది.

కృష్ణానదికి ఈశాన్యంగా ఉత్తరదిశలో ప్రవహించడం, అదే దిశలో పాతాళ గంగ ప్రవహిస్తూ వుండడం వల్ల ఆలయానికి దేశ వ్యాప్తంగా భక్తులు వస్తున్నారు.

ఈ ప్రవాహాలు స్థలవాస్తుకు మహత్యాన్ని సమకూరుస్తున్నాయి. ఆలయానికి ఈశాన్యంలోని పుష్కరిణి వాస్తుతేజాన్ని మరింతగా పెంచింది. వీధులు, తూర్పు, ఉత్తరాల్లో వాలు కలిగి వుండి ఆలయ మహాత్మ్యాన్ని మరింతగా పెంచాయి. అందు వల్లే రాష్ట్రంలో ఆదాయం గల దేవాలయాల్లో ద్వితీయ స్థానాన్ని ఆక్రమించిందని పెద్దలంటారు.

### వాస్తుబలం లేమి భద్రాచలం, సింహాచలంలో ఆకర్షణలేమి!

సుందర శిల్ప స్వప్నంగా అమరిన సింహాచలం ఆలయం, భక్తిప్రపత్తులతో నిర్మించబడిన భద్రాచలం ఆలయాలు అంతంతమాత్రం జనాకర్షణలతో నడుస్తూ వుండటం ఆయా ఆలయాల వాస్తులేమికి కారణమవు తున్నది.

### భద్రాచలం!

భక్తరామదాసు 'చింతాకు పతకము' చేయించిన సీతమ్మవారు. సువర్ణా భరణాలు చేయించిన శ్రీరాముల వారూ భద్రాచలం వారే! విగ్రహాలు పశ్చిమాభిముఖంగా ప్రతిష్ఠింపబడ్డాయి. గోదావరి పశ్చిమంలో ప్రవహిస్తూ స్థలాకర్షణకు తిలోదకాలిచ్చింది. గుడికి దక్షిణ నైరుతి వీధిపోటు సిరులకు వెన్నుపోటు అయింది.

### సింహాచలం!

తుళువ వంశాబ్ధి సోముడు శ్రీ కృష్ణ దేవరాయలు ఒరిస్సాపై దండెత్తి విజయం సాధించి, మార్గమధ్యంలో తన విజయానికి సూచకంగా ఇక్కడ ఆలయ నిర్మాణం చేపట్టాడని చరిత్ర చెబుతోంది.

సింహాచలేశ్వరుడు పశ్చిమాభిముఖంగా వుండటం కొంత వాస్తు బలాన్ని తగ్గించింది. తూర్పువైపున కొండలుండి పశ్చిమంలో పల్లంగా వుండటం వల్ల క్షేత్రమహాత్మ్యంపై

**వాస్తుసంగతులు**
**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
పిండిమిల్లు దగ్గర,
పొదలకూరు రోడ్డు, నెల్లూరు
ఫోన్ : 338159

'అవాస్తు' దాడి చేసింది. నైరుతిలో లేదా పశ్చిమ దక్షిణాల్లో నిర్మించవలసిన కళ్యాణ మండపం వాయువ్యంలో నిర్మించడం వల్ల వాయువ్యం భారమైంది. ఈ కారణాల వల్ల ఆలయాన్ని ఓ వంద సంవత్సరాల క్రితం మరాఠులు దోచుకోగా 1974-75 ప్రాంతాల్లో వచ్చల పతకం తస్కరింపబడింది.

### కనక వర్షం కురిపిస్తున్న కనకదుర్గమ్మ గుడి!

ఏ ముహూర్తాన కనక దుర్గమ్మ విగ్రహం ప్రతిష్ఠించబడిందో గానీ అన్ని సక్రమంగా వుండి కనకమ్మకు కనకవర్షమే సిద్ధించింది. అయితే వాస్తు వక్రతలు లేవని కాదు. అట్లాంటి వాస్తు వక్రతల వల్ల 98లో కొన్ని అవాంఛితాలు జరిగాయి. నగలు తస్కరించబడ్డాయి. వాయువ్యంలో వున్న లోపాల వల్ల అధికారులు ఆ సందర్భంలో మానసిక వత్తిడికి గురయ్యారు. అయితే చాలా వరకూ ఆలయంలో వాస్తు నిర్దుష్టంగా వున్నందు వల్ల శుభపరిణామాలు, సిరుల పంట, భక్తుల రద్దీ ఆలయానికి ఏర్పడు తున్నాయి. •

## జిల్లావార్తలు

5వ పేజీ తరువాయి

విధంగా మాంసం అమ్మటాన్ని మారు కావలి కసాయివీధిలోనూ, గూడూరు పాత బస్టాండు ప్రక్కన ఆస్పత్రి వద్ద రోడ్డులోనూ, నెల్లూరు టౌన్‌లోని మార్కెట్లు, సెంటర్లలోనూ చూడవచ్చు. కొంచెం మానవతా దృక్పథం తోనూ, జీతంగా తీసుకొంటున్న ప్రజల సొమ్ముకు వారి ఆరోగ్యాన్ని కాపాడాల్సిన బాధ్యతతోను ప్రవర్తించవలసి ఆరోగ్యశాఖ మర్చిపోతే ఎలా?

### ఉదయగిరిలో అనావృష్టికి తోడు అతివృష్టి!

ఇప్పటికే అనావృష్టితో అల్లాడుతున్న ఉదయగిరి నియోజక వర్గ మెట్ట రైతాంగానికి అనుకోని రీతిలో 17తేదీ రాత్రి అతివృష్టి తోడవ్వడంతో చేతికొచ్చిన పంటలు, పండ్లతోటలు నేలమట్టమయ్యాయి. మూలిగే నక్కపై తాటికాయ పడిన చందంగా అసలే వేలకువేలు అప్పులు తెచ్చి పంటపై వెచ్చించినప్పటికి సకాలంలో వర్షాలు లేక కరవు కోరల్లో చిక్కి విలవిల లాడుతున్న పేద రైతాంగం పాలిట అకాలంగా వచ్చిన గాలివాన అశనిపాతమయ్యింది. గాలివాన ఉధృతంగా వుండడంతో వరి, శనగ, చెరకు, పండ్ల తోటలు నేలమట్టమై లక్షలాది రూపాయలు రైతులు నష్టపోయారు. ఉదయగిరి, వరికుంటపాడు, వింజమూరు మండలాల్లో విస్తారంగా సాగుచేసిన మామిడి, నిమ్మ, జామ కాయలు ఏ తోటల్లో చూసినా నేలపై పరిచినట్లుగా పడి వున్నాయి. లక్షలాది రూపాయలు పెట్టుబడితో మామిడి, నిమ్మ చెట్లు కొనుగోలు చేసిన వ్యాపారులకు చేతికి చిల్లిగవ్వ దక్కే పరిస్థితి కనిపించడం లేదు. రాలిపోయిన మామిడి కాయలను లారీల ద్వారా నెల్లూరు, విజయవాడ, హైదరాబాదు మార్కెట్లకు తరలించి పాతికోపరకకో అమ్ము కొన్నారు. ఉదయగిరి, వింజమూరు, గండిపాళెం, గడ్డంవారిపల్లి, కృష్ణంపల్లిలలో తయారు చేసిన పచ్చి ఇటుక కూడా ఈ ప్రకృతి ప్రకోపానికి గురై 5లక్షల మేరకు తడిసి మట్టిపాలయ్యింది. ఈ వ్యాపారులకు కూడా ఇప్పటికి రెండు పర్యాయాలు ఇటువంటి దెబ్బ తగలడంతో వీరు నష్టాల పాలయ్యారు. ఈ ప్రాంతంలో సోమవారం గంటన్నరపాటు సంభవించిన గాలివాన తీవ్రత పెనుతుఫాన్‌ను మించిందని, వయసు మళ్లినవారు చెబుతున్నారు. రైతులకు సంభవించిన నష్టాన్ని దృష్టిలో పెట్టుకొని తగిన రీతిలో ప్రభుత్వం స్పందించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

### బొల్లినేని హాస్పిటల్ డాక్టర్ల ఉచితవైద్య శిబిరం

గూడూరు లయన్స్‌క్లబ్, బల్లి వెంచయ్య జ్ఞాపకార్థం గూడూరు ప్రభుత్వ ఆస్పత్రిలో నెల్లూరు బొల్లినేని సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ వైద్యులతో ఉచితవైద్య శిబిరాన్ని నిర్వహించింది. శిబిరాన్ని గూడూరు ఎమ్మెల్యే బల్లిదుర్గా ప్రసాద్ ప్రారంభించగా, మునిసిపల్ ఛైర్మన్ కోడూరు కల్పలత ముఖ్యఅతిథిగా విచ్చేశారు. డాక్టర్లు సి. శేష శ్రీనివాసులు, మల్లికార్జునరెడ్డి, జానకిరామ్, జడ్. శశికాంత్, కె. మల్లికార్జున్, రమ, రజ్వానీబేగం, 1000 మంది రోగులను పరీక్షించి ఉచితంగా మందులు పంపిణీ చేశారు. ఈ కార్యక్రమంలో క్లబ్ అధ్యక్షుడు రహీమ్ జాన్, కార్యదర్శి రియాజ్, లయన్ మాజీ గవర్నర్ వై.వి. ప్రభాకరరెడ్డి, సుధాకరరెడ్డి, కౌన్సిలర్ సురేంద్రనాథ్, గోపాల్, మురళీధర్ తదితరులు పాల్గొన్నారు.

### ఎన్నికలలో డబ్బే ప్రధానం

మున్సిపల్ ఎన్నికల్లో కాంగ్రెస్ అభ్యర్థులకు ధీటుగా తమ పార్టీ అభ్యర్థులు డబ్బు పంచక పోవడంతో ఓడిపోయినట్లు కావలి ఎమ్మెల్యే వంటేరు వేణుగోపాలరెడ్డి అభిప్రాయపడ్డారు. ఎన్నికల అనంతరం పార్టీలో బయల్పడిన వైరుధ్యాల నేపథ్యంలో ఇటీవల విలేఖరుల సమావేశం ఏర్పాటు చేసి మాట్లాడారు. కావలిలో తెలుగు దేశం పార్టీ ఓడిపోవడానికి నేను కారణం కాదు; కేవలం 'దేశం' అభ్యర్థి రామకోటారెడ్డి వైఫల్యమేనని పేర్కొన్నారాయన. యానాదిశెట్టికి ధీటుగా రాంకోటారెడ్డి డబ్బులు పంచలేదని, ఎన్నికలలో గెలవాలంటే డబ్బే ప్రధానమన్నారు. కానీ 'దేశం' ఓటమికి తనను బాధ్యుడ్ని చేసి రామకోటారెడ్డి బజారుకెక్కడం సంస్కారం కాదన్నారు. కావలి పట్టణ దేశం ఉపాధ్యక్షుడు ఆత్మకూరి బ్రహ్మయ్య వేణుగోపాలరెడ్డికి వ్యతిరేకంగా రెండు రకాల వాల్‌పోస్టర్లు ముద్రించి పట్టణమంతా అంటించి సంచలనం సృష్టించారు. దీంతో 'వంటేరు' కావలికి వచ్చి విలేఖరుల సమావేశం ఏర్పాటు చేయాల్సి వచ్చింది. కేవలం తనను అప్రతిష్టపాలు చేయడానికే యిదంతా చేస్తున్నారని వాపోయారాయన. దేశం కౌన్సిలర్ అభ్యర్థులకు, ఛైర్మన్ అభ్యర్థికి ఏ వార్డులోనూ సమన్వయం లేదని, ఆ మాత్రం కూడా ఛైర్మన్ అభ్యర్థి చేసుకోలేక పోయారని చెప్పాడు. తాను 19వార్డులలో తిరిగి ప్రచారం చేయగా 12వార్డులలో దేశం, బిజెపి అభ్యర్థులు గెలిచారని వేణుగోపాలరెడ్డి చెప్పాడు. మిగతా 9వార్డుల్లో సమయాభావం వల్ల ప్రచారం చేయలేక పోయానన్నాడు.

### గ్రాంధిక కితాబు

ఛైర్మన్‌గా యానాదిశెట్టి అన్ని విధాల అర్హుడని, వేణుగోపాలరెడ్డి మెచ్చుకొన్నాడు. ఏమి చూసి రాంకోటారెడ్డికి ఓటు వేయాలని ప్రశ్నించాడు? గత 20 సంవత్సరాలుగా రాజకీయాలలో వున్నానని చెప్తున్న ఈ వ్యక్తి, పట్టణంలోని ప్రజల కోసం ఒక లైటు వేయించాడా? గుక్కెడు నీళ్లు పోశాడా, యింకేమన్నా చేశాడా అని ప్రశ్నించాడు. ఏ విధమైన పని చేయక, గెలవాలంటే ఎలా సాధ్యమని రాంకోటారెడ్డిని వుద్దేశించి అన్నాడు. తాను మంచినీటిని ట్యాంకుల ద్వారా పంపిణీ చేస్తే ఎమ్మెల్యేగా గెలిచానని, అదే విధంగా మాగుంట కుటుంబీకుల ఏజెంటుగా యానాదిశెట్టి ఈ రోజు నీటి పంపకం ద్వారా గెలిచాడన్నాడు. అన్ని అనర్హతలున్న అభ్యర్థిని ఎందుకు ఛైర్మన్ అభ్యర్థిగా ఎంపిక చేశారని ప్రశ్నించగా, అధిష్టానం ఎన్నిక చేసిందని, కౌన్సిలర్ల అభ్యర్థుల ఎన్నికలో మీ పాత్ర ఏమిటని ప్రశ్నించగా, ప్యానెల్లో రాంకోటారెడ్డి కూడా సభ్యుడని జవాబులు చెప్పి తప్పించుకున్నాడు. విలేఖరుల సమావేశంలో వంటేరుతో పాటుగా 'దేశం' నాయకుడు మువ్వల వెంకటనారాయణ, దేశం కౌన్సిలర్లు 10 మంది పాల్గొన్నారు. సమావేశంలో ఓడిపోయిన కౌన్సిలర్ల చేత, ఏ విధంగా, ఎందుకు ఓడిపోయారో చెప్పించారు. పట్టణంలోని జనాభాలో 15శాతం జనాభాతో వైశ్యులు రెండవ స్థానంలో వుండగా, రెడ్లు మూడు శాతం జనాభాతో 6వ స్థానంలో వున్నారని, ఈ ఎన్నికలో 'కులం' ప్రభావం కూడా బాగా పనిచేయడంతో యానాదిశెట్టి గెలిచారని వేణుగోపాలరెడ్డి చెప్పుకొచ్చారు.

### వేణుగోపాలరెడ్డి ద్రోహం చేశాడు!

మున్సిపల్ ఎన్నికల్లో దేశం కౌన్సిలర్లు, ఛైర్మన్ అభ్యర్థి ఓటమికి ఎమ్మెల్యే వంటేరు వేణుగోపాలరెడ్డి కారకుడని, ఛైర్మన్‌గా ఓడిపోయిన రాంకోటారెడ్డి త్రిసభ్య కమిటీ ముందు ఆరోపించాడు. 16వ తేదీ హైదరాబాద్‌లో జరిగిన తొలి విడత పార్టీ సమీక్షా సమావేశాలలో రాంకోటారెడ్డి, వేణుగోపాలరెడ్డిపై ఆరోపణలు చేయగా, అవి అబద్ధాలని వంటేరు ప్రత్యారోపణలు చేసినట్లు తెలిసింది. ఎమ్మెల్యేలు గోరంట్ల బుచ్చయ్యచౌదరి, నాగమణి, జిల్లా ఇన్‌ఛార్జి ఎమ్మెల్యే పర్వతనేని ప్రభాకరరెడ్డిలతో ఏర్పడిన కమిటీ ముందు వీరు ఈ ఆరోపణలు చేసుకున్నారు. పత్రికలలో వచ్చిన వార్తలను చూపిట్టి కొందరు కౌన్సిలర్లు వంటేరుపై ఆరోపణలు చేసినట్లు తెలుస్తోంది. కావలి ఎన్నికల కమిటీలో వున్న తొమ్మిది మందిలో 6 మంది వంటేరు పక్షాన నిల్చినట్లు తెలుస్తోంది. మాజీ ఎమ్మెల్యే గొట్టిపాటి కొండప నాయుడు అనారోగ్య కారణంగా హైదరాబాదు వెళ్లలేక పోయినా వంటేరుకు వ్యతిరేకంగా తన అభిప్రాయం చెప్పినట్లు తెలిసింది. కాంగ్రెస్ అభ్యర్థికి ధీటుగా దేశం అభ్యర్థి డబ్బులు ఖర్చుపెట్టలేదని, అభ్యర్థులలో సమన్వయం లేకపోవడం కూడా ఓటమికి ఒక కారణమని వేణుగోపాలరెడ్డి కమిటీకి స్పష్టం చేసినట్లు తెలిసింది.

పొదుపుమొత్తాల తాసీల్దారు రాళ్లపల్లి రామసుబ్బారావు కుమార్తె గాయత్రీదేవి, వెంకటసుబ్రహ్మణ్యంల వివాహం ఈ నెల 14వ తేది నెల్లూరు పాండురంగ అన్నదాన సమాజంలో జరిగింది.

### 40లక్షల కుటుంబాలకు పక్కా గృహాలు!

సముద్ర తీరప్రాంత గ్రామాల్లో పక్కా గృహాలు నిర్మించడానికి ప్రభుత్వం అత్యధిక ప్రాధాన్యత ఇచ్చి కృషి చేస్తోందని నర్సుమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి చెప్పారు. 16తేది సూళ్లూరుపేట నియోజక వర్గ పరిధిలోని తడ, దొరవారిసత్రం మండలాల్లోని వివిధ గ్రామాల్లో పలు అభివృద్ధి పనులకు ప్రారంభోత్సవాలు, శంకుస్థాపనలు మంత్రి చేశారు. ఈ సందర్భంగా సూళ్లూరుపేటలో మంత్రి విలేఖరులతో మాట్లాడుతూ రాష్ట్రంలో దారిద్ర్యరేఖకు దిగువున వున్న 40లక్షల కుటుంబాలకు పక్కా గృహాలు నిర్మించడమే ధ్యేయంగా ప్రభుత్వం పని చేస్తోందన్నారు. పక్కా గృహాల నిర్మాణంలో దేశంలోనే మొదటి స్థానంలో వున్న ఆంధ్రప్రదేశ్ గత ఐదేళ్లలో 35లక్షల పక్కా గృహాలు పేదలకు కట్టించిందన్నారు. రాబోయే 5 సంవత్సరాల్లో సంవత్సరానికి 7లక్షల వంతున 35లక్షల పక్కా గృహాలు కట్టించేందుకు ప్రభుత్వం సిద్ధమవు తుందన్నారు. సూళ్లూరుపేటలోని రాఘవయ్య పేటలో 3లక్షల 80వేల రూపాయలు మున్నెముద్దు సోదరుల విరాళంతో పంచాయితీరాజ్ శాఖ నేతృత్వంలో నిర్మించిన స్కూల్ భవనాన్ని, వద్దవడకలో గ్రామస్తులు కలసి నిర్మించుకొన్న పాఠశాల భవనాన్ని మంత్రి ప్రారంభించారు. తడ మండలం కొండూరులో 78 మందికి ఇళ్లస్థలాల పట్టాలు, మావిళ్లపాడులో రాజీవ్ టెక్నాలజీ మంచి నీటిపథకం, దొరవారి సత్రంలో పది పడకల ఆసుపత్రిని మంత్రి ప్రారంభించారు. సూళ్లూరుపేట ఎమ్మెల్యే పరసా రత్నం, జిల్లా కేంద్ర సహకార బ్యాంకు అధ్యక్షుడు వేనాటి మునిరెడ్డి, గృహనిర్మాణ సంస్థ మేనేజర్ ఎ. రవిప్రకాష్ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

• • •

# అందాలుండేది అందరికీ చూపనేగా?

## కొత్త హీరోయిన్ రస్న భాష్యం

రాఘవయ్యగారి అబ్బాయి చిత్రంలో హీరోయిన్‌గా నటించిన రస్న అసలు పేరు ప్రశాంతిని. పుట్టింది, పెరిగింది వైజాగ్‌లో. కంప్యూటర్‌లో పోస్ట్ గ్రాడ్యుయేషన్ కూడా పూర్తి చేసింది. చిన్నప్పటి నుంచి సినిమాల్లో నటించాలన్న కోరిక వుండటంతో ఫోటోగ్రఫీలో మోడలింగ్ చేస్తూ రాఘవయ్యగారి అబ్బాయి చిత్రం హీరోయిన్ అయ్యానంటుంది. తానిప్పుడు బిగినింగ్ స్టేజ్‌లో వున్నానని, పెద్ద కేరక్టర్, చిన్న క్యారెక్టర్ అని చూడకుండా మంచి క్యారక్టర్స్ ఎటువంటివి వచ్చినా నటిస్తానంది. గ్లామర్ అన్నది ఈ రోజున చాలా ముఖ్యం. పాత్రకు అవసరమైన గ్లామర్‌ని వేయడానికి నేనెప్పుడూ రెడీనే. ఈ గ్లామర్‌ని ఎక్స్‌పోజ్ అనుకున్నా పర్వాలేదంటుంది.

### మీనా శిష్యురాలు

మీనా, తమిళ నటి సువలక్ష్మి కలసి మాయి అనే చిత్రంలో నటిస్తున్నారు. ఈ సినిమా షూటింగ్ గ్యాప్‌లో సువలక్ష్మి మీనా దగ్గర కోర్చుని సినిమా పరిశ్రమ గూర్చి తన సందేహాలను తీర్చుకొంటూ, సలహాలు కూడా స్వీకరిస్తుందట. మీనా కూడా ఇందులో తప్పేమీ లేదని తనకు తెలిసినవి చెబుతుందట. కాని మీనా తల్లి మాత్రం విలేఖరులతో ఈ వ్యవహారమై మాట్లాడుతూ మా అమ్మాయి సువలక్ష్మికి గురువేమిటండీ, మా అమ్మాయికంత వయసు అయిపోయిందనా, ఈవిడ ఉద్దేశ్యం? కొంచెం లావుగా వుంది, ఎక్కువ సినిమాలు చేస్తే మటుకు ఎక్కువ వయస్సు వచ్చేసినట్లా? అసలు సువలక్ష్మి కంటె మా అమ్మాయే చిన్నది. మరి ఈ పొట్టిదాని గోలేమిటో అర్థం కావడం లేదని సణుగు తుందట. భలేగా వుంది కదూ ఈ గొడవ?

### ఐశ్వర్యారాయ్‌పై కేసు

ఐశ్వర్యారాయ్ నటించిన ఇద్దరు, జీన్స్, తాళ్, హమ్ దిల్‌దే చుకే సనమ్ సినిమాలన్నింటికన్నా ముందుగా ప్రారంభమైన చిత్రం 'రాధే శ్యామ్ సీతారామ్'. కానీ ఆ చిత్రం

కొరవ 11వ పేజీలో

# రమణమహర్షిగా రజనీకాంత్!

సంచలన ప్రకటనలు చేయడంలో మిగతా హీరోలు రంజనీకాంత్ వెనుకనే అని చెప్పవచ్చు. ఈ మధ్య రజనీ తన జీవితపు కోరికను వెల్లడించారు. నేను సినిమా రంగం నుంచి తప్పుకొనేటప్పుడు ఆ మహానుభావుడి క్యారక్టర్ పోషించి నా నట జీవితానికి శుభం కార్డు వేస్తాను. ఆ సినిమాలో ఫైట్స్, ప్రేమ, సెంటిమెంట్లు వగైరాలు వుండవు. ఆ మహానుభావుడు ఎవరో తెలుసా? రమణమహర్షి. ఆయన అద్భుతమైన జీవితంలోని సంఘటనలను సినిమాగా తీస్తాను. అయితే అది ఎప్పుడూ ఏమిటనేది ఇప్పుడిప్పుడే చెప్పలేనన్నారు. గతంలో రజనీకాంత్ శ్రీ రాఘవేంద్రస్వామి చిత్రాన్ని స్వయంగా నిర్మించి స్వామిగా నటించారు.

### మా అత్త బంగారం

ఈ రోజుల్లో అత్తను మెచ్చుకొనే కోడళ్లు ఎవరైనా వుంటే ప్రత్యేకంగా చెప్పుకోవాలి. అటువంటి మంచి కోడలు ఖుష్బూనే. ఈ మధ్య దర్శకుడు సుందర్‌ను పెళ్లి చేసుకున్న ఖుష్బూను ఎలా వుంది మీ కొత్త జీవితం అని ప్రశ్నిస్తే, చాలా బాగుంది, ఆనందంగా వుందంది. మరి అత్తగారు? అనంటే ఆమె ముఖం వేయి క్యాండిల్స్ బల్బులా మారింది. ఆమె నన్ను తల్లిలా చూసుకొంటున్నారు. అసలు అత్తగారి లాగానే కాదు. ఇంకా చెప్పాలంటే ఒక ప్రాణ స్నేహితురాలిగా నాతో

## ఈ చిత్రంతోనే రిటైర్ అవుతాడట

మెలుగుతున్నారు. నేను ప్రస్తుతం షూటింగుల వల్ల బిజీగా వున్నాను. ఉదయాన్నే వెళ్లి, చీకటి పడ్డాక ఇంటికి చేరుకొంటున్నాను. ఇంటికి వెళ్లగానే మా అత్తయ్య చిరునవ్వుతో స్వాగతం పలుకుతుంది. నన్ను ఒక్క పని చేయనివ్వదు. వంటతో పాటు అన్ని ఆమే చేస్తారు. నేను చేస్తాలే అత్తయ్యా అంటే నువ్వు కూర్చో నేను చేస్తాకదా అంటారు. నేనంటే మా అత్తగారికి చాలా ఇష్టం. అటువంటి అత్తగారు దొరకడం నిజంగా తన అదృష్టమంటుంది ఖుష్బూ. లక్షలు సంపాదించే కోడళ్లను అత్తలు బంగారంలా చూసుకోరా మరి?

### భార్యకు నచ్చితేనే నటిస్తాడు!

తమిళ అగ్రహీరో విజయ్ ఏదైన సినిమాలో నటించాలంటే ముందు ఆయన భార్యకు కథ నచ్చాలట. ఇది వరకు విజయ్ నటించే సినిమా కథల్నిగాని, సబ్జెక్టులను విజయ్ తన దర్శకుడైన తన తండ్రి ఎస్.ఏ. చంద్రశేఖర్ ప్రక్కన కూర్చొని విని ఓకే చేసేవాడు. ప్రస్తుతం విజయ్ ఆ కథలను ఆడియో క్యాసెట్ రూపంలో నిర్మాతలను అడుగుతున్నాడు. రచయిత చెప్పిన ఆడియో కథను రాత్రిపూట బెడ్ రూంలో శ్రీమతితో కలసి వింటున్నాడట. ఆమె ఓకే అంటేనే నిర్మాతలకు కాల్షీట్స్ ఇస్తున్నాడు. దీంతో నిర్మాతలు ఆయన భార్యను ప్రసన్నం చేసుకోను రకరకాల కానుకలతో ఇంటి ముందు వుంటున్నారట.

# అందరూ చూడతగిన చిత్రం

## బద్రి

చిత్రంలో హీరో పేరు బద్రీనాథ్. అందరూ అతన్ని ముద్దుగా 'బద్రి' అని పిలుస్తుంటారు. ఆ రెండక్షరాల పేరు దర్శక నిర్మాతలకూ ముద్దొచ్చినట్టుంది. అందువల్ల వారి చిత్రానికి ముద్దుగా 'బద్రి' అని పేరు పెట్టుకున్నారు. ముద్దులొలికే బలవర్థకమైన 'బద్రి' అనే పేరుగల హీరో పాత్రను పవన్ కళ్యాణ్ బహాభద్రంగా పోషించి ప్రేక్షకులకు ఆ పేరు మీద, ఆ పేరును పొందిన పాత్రమీద ముద్దుకలిగేట్టు చేశాడు. ప్రేక్షకుల హృదయాలను హత్తుకొనేట్టు చేశాడు.

'బద్రి' చిత్రంలో బద్రిపాత్ర చాలా ప్రముఖమైంది. మంచి ప్రాధాన్యతను సంతరించు కుంటుంది. యాక్ ఫిలిం డైరక్టర్‌గా వుంటూ చాలా సరదాగా మసలుతుంది పాత్ర. నిర్మలమైన వ్యక్తిత్వం, పవిత్ర ప్రేమలతో మసలే పాత్ర ఇది. విరోధులను మట్టి కరిపించాలను కున్నప్పుడు నిలువెత్తు గాంభీర్యంతో ఫైటింగుల్లో తనదే పైచేయిగా నిలిచే పాత్ర. ఈ పాత్రలో, ఇద్దరు ప్రియురాళ్ల ప్రేమ, బాంధవ్యంలో ఎదురయ్యే సమస్యలకు గొప్పగా స్పందించి, పవన్ కళ్యాణ్, సహజంగా, సమయ స్ఫూర్తితో, బహునేర్పుగా, వివిధ కోణాలతో ఆ పాత్ర ప్రవర్తించవలసిన తీరు తెన్నులను, అందరూ ఆకట్టుకునే విధంగా ప్రదర్శిస్తూ నటించాడు. తన నటనా వైవిధ్యంతో ఇది వరకే యువతరంలో ఒక ప్రత్యేకమైన ఇమేజ్‌ను సంపాదించుకున్న పవన్ కళ్యాణ్ ఈ పాత్ర పోషణతో ఆ

**చిత్రసమీక్ష**

**గ్రిద్దలూరు గోపాలరావు**

ఇమేజ్‌ను ఘనతరం చేసుకున్నాడు. ఇంతెందుకు ఈ చిత్రం పవన్ కళ్యాణ్ చిత్రంగా చెప్పాలి. ఈ చిత్రంతో దర్శకుడుగా పరిచయమైన పూరీజగన్నాథ్ కథ, మాటలు, స్క్రీన్‌ప్లే వ్రాశాడు. బద్రి పాత్రను అన్ని కోణాలతో రాణింపుగా తీర్చాడు. చిత్రానికి ప్రాణంగా నిలిపాడు. ఆ తర్వాత ముఖ్యమైన ఒక హీరో యిన్ సరయు పాత్రను, రెండో హీరోయిన్ వెన్నెల పాత్రను, సరయు అన్న నంద పాత్రలను కూడా దర్శకుడు ప్రాముఖ్యతను సంతరించుకునే విధంగా మలిచాడు. ముఖ్యమైన ఈ నాలుగు పాత్రలకు బరువైన సన్నివేశాలను సృష్టించి పాత్రలను చురుగ్గా నడిపించాడు. చిత్రం మొదటి భాగాన్ని ఇద్దరమ్మాయిల ప్రేమలో పడిన బద్రి ప్రేమ వ్యవహారాలతో, ఆ ప్రేమికుల అల్లరి చిల్లరి చిలిపిచేష్టలతో, ఊహాగానాలతో ఉల్లాసంగా వినోదంగా ప్రేక్షకులు నృత్యరీతుల్లో, ప్రకృతి రామణీకయంలో విహరించటాలతో దర్శకుడు చాలా ఆకర్షణీయం చేశాడు. రెండవ భాగంలో ముగ్గురు ప్రేమికుల ప్రేమ వ్యవహారం తీర్పు, క్లైమాక్స్, సస్పెన్స్, చిత్రం ముగింపులో వైవిధ్యం, వీటన్నిటికి విలువైన రూపు కల్పించాడు.

ఫైటింగులు గగుర్పాటు కల్గించే విధంగా చిత్రీకరించబడ్డాయి. ఫైటింగు సన్నివేశాల్లో పవన్ కళ్యాణ్ కనుపరచిన గాంభీర్యం ప్రశంసనీయం. సెట్టింగులు భారీ ఎత్తున ఉన్నాయి.

చిత్రం ప్రారంభంలో బద్రి పాత్ర పరిచయానికి సంబంధించిన పాట హిందీ, ఇంగ్లీషు భాషల్లో, "వైడూ యూ వర్రీ - బి యూ బోర్న్" - అంటూ, జాతీయ సమైక్యత మీద సాగింది. ఈ పాట దృశ్యాన్ని భారీ సెట్ల మీద ఎక్కువ మంది డాన్సర్లతో ఆకర్షణీయంగా, ఆసక్తికరంగా చూపబడింది.

కొరవ 11వ పేజీలో



బద్రీ చిత్రంలో పవన్‌కళ్యాణ్, హమీషా పటేల్

# రంభ కాస్ట్యూమ్స్‌కు కంప్యూటర్ మెరుగులు!

గతంలో గ్లామర్ హీరోయిన్ రంభ వాళ్ళక్కయ్య కుమార్తె గౌనును ఇన్స్పిరేషన్‌గా తీసుకొని కాస్ట్యూమ్స్ కుట్టించుకొనేది. ఇప్పుడా పాప పెద్దమ్మాయి కావడంతో ఆ కాస్ట్యూమ్స్ వేసుకోవడం కుదరదు గనుక రంభ సొంతంగా కంప్యూటర్ ద్వారా తన బట్టలను ఎంపిక చేసుకొంటుంది. తన పూర్తి ఫిగర్‌ను కంప్యూటర్‌లోకి ఫీడ్ చేసుకొని, ఆ ఫిగర్‌కు రకరకాల కాస్ట్యూమ్స్ సెట్‌చేసి చూసుకొంటూ తనకు నచ్చిన కాస్ట్యూమ్స్ ఫిగర్‌ను ప్రింట్ అవుట్ తీసి నిర్మాతలకు అందజేస్తుంది. ఆ ప్రకారంగానే నిర్మాతలు రంభకు కాస్ట్యూమ్స్ రూపొందిస్తున్నారు. ఈ కంప్యూటర్ పనంతా తానే స్వయంగా చేసుకొనేందుకు రంభ ఆరు నెలల పాటు ట్రైనింగ్ కూడా తీసుకొన్నట్లు వివరించింది.

### ఎవరి అందం గొప్ప?

మాజీ ప్రపంచ సుందరి ఐశ్వర్యారాయ్, మలయాళ హీరో మమ్ముట్టి మధ్య 'కండుకొండేన్ - కండు కొండేన్' సినిమా సెట్‌లో చిన్నపాటి సరదా ఘర్షణ జరిగింది. నేను అందగత్తెనని ఐశ్వర్యారాయ్ చెప్పగా, కాదు నేనని మమ్ముట్టి వాదించుకొన్నారు. ఇంతలో అక్కడికి వచ్చిన టాబు - అజిత్‌ను ఈ విషయమై అడగ్గా వాళ్లిద్దరు ముఖాలు చూసుకొని మీ ఇద్దరికన్నా మేమిద్దరం అందమైన వాళ్లం అన్నారట. నలుగురి మధ్య ఈ సమస్య పెద్దది కాగా అబ్బాస్ అక్కడికి వచ్చాడట. అందరూ ఈ విషయాన్ని నివేదించగా అతను గొంతు సవరించుకొని మీసొంతలుకాని అందం కోసం ఎందుకంత తాపత్రయ పడుతున్నారో

## హైదరాబాదు సినిమా వార్తలు

నాకు అర్థం కావడం లేదు. పైగా నా అంత అందగాడిని ఎదురుగా పెట్టుకొని కూల్‌గా చెప్పాడట.

### ప్రపంచ సుందరి బాధ

ఈయేటి ప్రపంచ సుందరి యుక్తాముఖి హిందీ చిత్రాల్లో నటించను తహతహలాడుతుంది తన కిష్టమైన హీరోలు అనిల్ కపూర్, షారూఖ్‌లని, హీరోయిన్లలో ఐశ్వర్య, కరిష్మా, మనీషా, కాజోల్‌ను అభిమానిస్తానంది. హమ్ దిల్‌దే చుకేసనమ్‌లో ఐశ్వర్యరాయ్ పోషించిన వంటి పాత్రలు పోషించాలని తాను భావిస్తున్నట్లు చెప్పింది. తనకు సల్మాన్‌ఖాన్,

కొరవ 11వ పేజీలో

# వారఫలాలు

22.4.2000తేది నుండి 28.4.2000తేది వరకు మీనంలో 25తేది వరకు శుక్రుడును 26తేది వరకు బుధుడు ; 26తేది నుండి శుక్రుడును, 27తేది నుండి బుధుడు మేషరాశిలో ; మేషంలో రవి, శని, గురువులు; కుజుడు మేషంలో 24తేది వరకు; 25తేది నుండి వృషభరాశిలో ఉంటారు; కర్కాటకంలో రాహువు, మకరంలో కేతువు; వృశ్చిక, ధనుర్మకర, కుంభాలలో చంద్రుడు.

## మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

కుటుంబ ఖర్చులు ఎక్కువై, రాబడి తగ్గుతుంది. వృత్తి, వ్యాపార, వ్యవసాయ విస్తరణావకాశాలు వస్తాయి. రావలసిన బాకీలు వారాంతంలో లభించవచ్చును. ఉద్యోగులు అధికారులతో సన్నిహితంగా మెలిగి గుర్తింపు పొందుతారు. సొంత పనులు అనుకూలంగా కదులుతాయి. ఆరోగ్యం సరిగా ఉండదు. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. బంధువుల రాకపోకలుంటాయి. శుభవార్తలు వింటారు. సన్నిహితులకు సహకార మందిస్తారు.

## వృషభం

(కృత్తిక 2,3,4 పాదాలు, రోహిణి, మృగశిర 1,2పాదాలు)

శ్వాసకోశ రుగ్మతలుండి మెల్లగా కోలుకుంటారు. ఆదాయం తగ్గుతుంది. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాల వారికి రాబడి ఆశించినట్లు రాదు. అధికార యంత్రాంగం వల్ల పనిభారం పెరుగుతుంది. ఆలోచనలు అధికంగా ఉండి కలవరపెడతాయి. కొత్త వ్యక్తులతో, అధికార యంత్రాంగంతో పరిచయాలు పెరుగుతాయి. పిల్లల వల్ల ఖర్చులు పెరుగుతాయి. శుభకార్యాలలో పాల్గొంటారు. దూర ప్రయాణాలుంటాయి. దైవ కార్యక్రమాలలో పాల్గొంటారు. కుటుంబ సౌఖ్యం ఉంటుంది.

## మిధునం

(మృగశిర 3,4పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

ఆర్థిక పరిస్థితి బాగుంటుంది. ఉన్న రంగాలలో చొరవ, పెట్టుబడి ప్రయత్నాలుంటాయి. సొంత పనులు సక్రమంగా జరిగిపోతాయి. వారం మధ్యలో కొద్ది అనారోగ్యం ఉంటుంది. కుటుంబ సభ్యులకు కూడా అనారోగ్యం ఉండవచ్చును.



## కర్కాటకం

(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్రేషలు)

పనులు నిదానంగా జరిగి ఆందోళన కలిగిస్తాయి. ఆర్థిక ఇబ్బందులు మెల్లగా సర్దుకుంటాయి. చిన్న చిన్న సమస్యలు రాజీ దిశగా వస్తాయి. కుటుంబ ఆస్తి వ్యవహారాలు సర్దుకోక తప్పదు. వ్యాపార, వ్యవసాయ వర్గాలకు కొత్త ప్రయత్నాలు చేస్తారు. ఉద్యోగుల బాధ్యతాయుతంగా పనులు చేసి అధికారుల అనుగ్రహం పొందుతారు. రాజకీయ వర్గాల వారు ఎదురు పోటీని గమనించుకోవాలి. బాకీలు త్వరగా వసూలు కావు.



## సింహం

(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

తొందరపాటు ఎక్కువగా ఉండి, అపనిందలు పడగలరు. ప్రతివారిని అనుమానిస్తారు. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం బాగానే ఉంటుంది. స్వల్పంగా అనుకోని ఆదాయం లభిస్తుంది. ఒక చిన్న విషయంపై బంధువులతో మనస్పర్థలు వస్తాయి. దైవ కార్యక్రమాలలో పాల్గొంటారు. బంధువుల వియోగవార్తలు వినవచ్చును. వారాంతంలో వస్తు నష్టం ఉంటుంది.



## కన్య

(ఉత్తర 2, 3, 4 పాదాలు; హస్త; చిత్ర 1,2 పాదాలు)

కుటుంబ వ్యక్తుల పనుల వల్ల చికాకులు, తగాదాలు కలుగుతాయి. సొంత పనులు సరిగా జరుగవు. సహాయపడవలసిన వారు ముఖం చాటుచేస్తారు. అనవసర ఖర్చులు ఎక్కువ కాగలవు. వృత్తి, వ్యాపార, వ్యవసాయ వర్గాల వారికి ఆర్థికంగా ఇబ్బందు లుంటాయి. ఆరోగ్య సమస్యలుంటాయి.



## తుల

(చిత్ర 3,4పాదాలు, స్వాతి, విశాఖ1, 2, 3 పాదాలు)

కుటుంబ సభ్యుల మధ్య చిన్న చిన్న గొడవలు జరుగవచ్చును. వృత్తి, వ్యాపార రంగాలలో ఆర్థికస్థితి బాగుంటుంది. వ్యవసాయదారులకు కొద్దిగా ధన నష్టం, పంట నష్టం కలుగవచ్చును. చేపట్టిన పనులన్నీ శ్రమపడితేగాని జరుగవు. కొత్త వస్తువులు కొనడం, శుభ కార్య నిర్ణయాలు జరపడం చేస్తారు.

### పంచాంగం

**గురు మౌఢ్యమి**

తేది 24 సోమవారం సాయంకాలం గంట 6.00లకు గురుమౌఢ్యమి ప్రారంభం. శుభకార్యాలుండవు. తేది 28 శుక్రవారం భరణికార్తె ప్రారంభం. తేది 27 గురువారం నుండి మేషంలో పంచగ్రహ కూటమి.

**ఏప్రిల్ తిథులు**

**చైత్ర బహుళ**

తేది 22 శని చతుర్థి రా 2.40 గం.వ
తేది 23 ఆది పంచమి రా4.45 గం.వ
తేది 24 సోమ షష్ఠి పూర్తిగ
తేది 25 మంగళ షష్ఠి ఉ 6.47 గం.వ
తేది 26 బుధ సప్తమి ఉ 8.30 గం.వ
తేది 27 గురు అష్టమి ఉ10.20 గం.వ
తేది 28 శుక్ర నవమి ప 11.50గం.వ

**స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ.**



## వృశ్చికం

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఆరోగ్యపరంగా బాగుండదు. డబ్బు బాగా ఖర్చవుతుంది. ఈ రాశి వారికి ఆర్థిక పరిస్థితి సామాన్యంగానే ఉంటుంది. అల్లుళ్లతో విభేదాలు రావచ్చును. కొత్త అవకాశాల కొరకు ఆశపడతారు గాని ప్రయోజనం ఉండదు. దూర ప్రయాణావకాశాలు కలిసి వస్తాయి. అధికారవర్గంతో జాగ్రత్తగా మెలగవలెను. వ్యవసాయదారులు కొంత జాగ్రత్తపడాలి. విద్యా రంగంలో కొత్త కృషికి అవకాశాలున్నాయి.



## ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

ఇతరులకు డబ్బు, మాట రూపంలో సహాయపడతారు. వృత్తి, వ్యాపార రంగాలలో మంచి ఆదాయం ఉంటుంది. వ్యవసాయదారులకు మాత్రం రాబడి సామాన్యం. రావలసిన బాకీలు లభిస్తాయి. అనుకున్న పనులు ఒక ప్రణాళిక బద్ధంగా జరుపుతారు. ఉద్యోగ నిర్వహణలో సమర్థతను ప్రదర్శిస్తారు. వారం మధ్యలో ఒకటి రెండు రోజులు ఆరోగ్యం సరిగా ఉండదు. సాంస్కృతిక, రాజకీయ రంగాలలో ప్రాధ్యాలం, మంచి పట్టు కల్గి ఉంటారు.



## మకరం

(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

కుటుంబ ఆర్థిక సమస్యల నుండి విముక్తి ఇప్పుడిప్పుడే మెల్లగా ఆరంభమవుతుంది. సహాయపడవలసిన వారందరు మిమ్మల్ని శత్రువులుగా చూస్తారు. మానసిక ప్రశాంతం తక్కువగా ఉంటుంది. చేయదలచుకొన్న పనులు, చేస్తున్న పనులు నిదానంగా జరుగును. రావలసిన బాకీలు స్వల్పంగా అందగలవు. సాంస్కృతిక, వ్యవసాయ రంగాలలో ఆశించిన రాబడి ఉండదు. అధికారులు మీచే పనులు చేయించుకొంటారు.



## కుంభం

(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

నిలబడిపోయిన సొంత పనులు కొనసాగుతాయి. బంధుమిత్రుల సహకారం బాగుండి, రావలసిన బాకీలను వచ్చేటట్లు చేస్తారు. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో కొద్ది ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగ విధి నిర్వహణలో సమర్థత ప్రదర్శించి, గుర్తింపు పొందుతారు.



## మీనం

(పూర్వాభాద్ర 4 పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

ఈ వారం ఆర్థిక పరిస్థితి బాగుంటుంది. కుటుంబంలో మనస్పర్థలు, అపార్థాలు తొలగిపోతాయి. నూతన వస్తువులు కొనవలసి రావచ్చును. వృత్తి, వ్యాపారాల పెరుగుదల ప్రయత్నాలు అనుకూలిస్తాయి. పెట్టుబడి రంగంలో ఆదాయం పెరుగుతుంది. పట్టుదలతో సొంత పనులు పూర్తి చేయించుకుంటారు. అధికారులు మీ చేత బాగా పనులు చేయించుకుంటారు. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. విద్యా ప్రగతి బాగుంటుంది. సాంస్కృతిక రంగ కార్యక్రమాలలో పాల్గొంటారు.

# జనవాణి

3వ పేజీ తరువాయి

పికెయాలంటే భారీగా ఉద్యోగాలను లేదా పనులు కల్పించాలి. తద్వారా కొనుగోలు శక్తిని ప్రజలకు కల్పించాలి. దారిద్ర్యానికి అమిత దగ్గర చుట్టం అనారోగ్యం. పిల్పి పనులిచ్చినా పౌష్టికాహార లోపం వల్ల పనులు చేయలేని నిస్సహాయ దుస్థితి నేడు పేదలది. వారికి ఉచితంగా వైద్య సేవలు అందివ్వాలి. ప్రభుత్వ పథకాలన్నీ ఆశించిన ఫలితాలు సాధించక పోవడానికి అసలు కారణం, బడుగు లందరూ నిరక్షరాస్యులు కావడమే. వారిలో విద్యా గంధం లేక చైతన్యం లోపించడమే. అందుకే అక్షరాస్యతను ప్రజా ఉద్యమంగా మలచాలి. ఇక్కడ విద్యార్థులకే ఉద్యోగాల్లేవు. కాయ కష్టం చేయగల కండపుష్టి గల వాళ్లకు సంవత్సరం పొడవునా పనుల్లేక కడుపు నిండటం లేదు. పారిశ్రామిక ప్రగతిని పుంజుకొన్న సంపన్న దేశాలలో జనాభా చాలా తక్కువ. పనులు వేగంగా జరగాలంటే వారికి కంప్యూటర్ల అవసరం జాస్తి. మనకు మనుషులెక్కువ. పనులు తక్కువ. కంప్యూటర్ల వల్ల జరిగేది ఉపాధి రహిత అభివృద్ధి. జబ్బు ఒకొక్కటైతే - మందు వేరొకటి ఇస్తే ఎలా? మనదేశంలో 70శాతం జనాభాకు మూలాధారం వ్యవసాయం. కాబట్టి ప్రభుత్వం వ్యవసాయాన్ని ఆదుకోవాలి. దేశానికి పట్టుగొమ్మలైన గ్రామ సీమల్ని సౌభాగ్య మయం చేయాలంటే తక్షణం గ్రామీణ పరిశ్రమల్ని నెలకొల్పాలి.

గూడూరు — పి.వి. ప్రభాకరరావు

### టెలికాం వారికి విజ్ఞప్తి

కావలి టెలిఫోన్ వాడకందార్లకు టెలికాం శాఖ గతంలో డయల్ టెలిఫోనులు సరఫరా చేసింది. ఈ మధ్య టెలిఫోన్లు ఇచ్చిన వారికి పుష్ బటన్ ఫోన్లను ఇచ్చారు. ముఖ్యంగా ఎస్‌టిడి ఫోన్ చేసేటప్పుడు రీ డయలింగ్ సౌకర్యం, డయల్ టెలిఫోన్లకు లేనందున వినియోగదారులు అసౌకర్యానికి గురౌతున్నారు. కనుక డయలింగ్ రకం ఫోన్‌లు ఇచ్చిన వారి నుండి వాటిని తీసుకొని వాటి స్థానంలో పుష్‌బటన్ ఫోనులను టెలికాం శాఖ సరఫరా చేస్తే బాగుంటుంది. కావలి టెలికాం వినియోగదారులకు ఫోన్ బిల్లులు కూడా ఆలస్యంగా అందుతున్నాయి. దీన్ని ఆ శాఖాధికారులు సరిదిద్దాలి.

కావలి — ప్రొఫెసర్ నాగరాజారావు

### క్రికెట్‌పై మాయనిమచ్చ

యావత్తు క్రీడాజగతిని దిగ్భ్రాంతిని గురిచేసిన దక్షిణాఫ్రికా క్రికెటర్ల మ్యాచ్ ఫిక్సింగ్ ఉదంతం క్రీడాభిమానులను నివ్వెరపర్చింది. అంతర్జాతీయంగా నంబర్ వన్ ఆల్ రౌండర్‌గా ఖ్యాతి గాంచిన హన్సీక్రోనే కేవలం మ్యాచ్‌లలోనే కాక, వాణిజ్య ప్రకటన ఒప్పందం ద్వారా కోట్ల రూపాయలు సంపాదిస్తున్నాడు. అలాంటి స్థాయి కలిగిన ఆటగాడు పది, పదిహేను వేల డాలర్ల తక్కువ మొత్తానికి ఎందుకు ఆశపడ్డాడో ఒకపట్టాన అంతుబట్టడం లేదు. మొత్తానికి హన్సీక్రోనే క్రీడా రంగానికి, క్రీడాభిమానులకు ద్రోహం చేశాడు. సైన్సు అభివృద్ధి చెందిన ఈ ఆధునిక యుగంలో క్రికెట్, డబ్బు ముద్రించే సాధనంగా మారిపోయింది. ఇప్పుడే క్రికెట్ ఆడే, క్రికెట్‌ను ఆరాధించే దేశాలు పెరిగాయి. బెట్టింగ్ సంస్కృతి జడలు విప్పడంతో బుకీల పంట పండుతున్నది. ఆసక్తికరంగా మంచి వాతావరణంలో సాగాల్సిన మ్యాచ్ ఫలితాలను శాసిస్తూ, ఆటగాళ్లను కొనుగోలు చేసేందుకు వాళ్లు వెనుదీయడం లేదు. పోరాట స్వభావానికి మారుపేరుగా అవతరించిన దక్షిణాఫ్రికా క్రికెటర్లకు ఆరాధ్య దైవం, స్ఫూర్తి ప్రదాత అయిన హన్సీక్రోనే చేసిన ఒక్క తప్పటడుగుతో క్రీడా జీవితం కోల్పోయిన తీరు మనక్రీడాకారులందరికీ ఒక గుణపాఠం కావాలి. బెట్టింగ్, మ్యాచ్ ఫిక్సింగ్ లాంటి నీతిలేని చర్యలకు బరితెగించిన ఆటగాళ్లపై శాశ్వత నిషేధం విధించాలి.

నెల్లూరు — ఎ.వి.వి. రామప్రసాద్

### ఏమిటీ ఈ దిగుమతుల విధానం?

ఇటీవల కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన దిగుమతుల విధానం వల్ల దేశీయంగా చిన్న పరిశ్రమలు కుప్పకూలి పోయే పరిస్థితి ఏర్పడింది. ఉప్పు మొదలు సమస్తం దిగుమతి చేసుకోవలసినంత అవసరం మన దేశానికి ఉన్నదా లేదా అనే అంశాన్ని చూడకుండా ప్రపంచ దేశాల వెంట పరుగులు తీస్తే బోర్లా పడడం ఖాయం. సంపన్న దేశాలు ఆడుతున్న నాటకంలో మనం పావులమై పోయి మన ఆర్థిక వ్యవస్థను చేజేతులా ఛిన్నాభిన్నం చేసుకొంటున్నాం. గాంధీజీ గ్రామీణ పరిశ్రమలు వర్థిల్లాలని కలలు కంటే, నెహ్రూ భారీ పరిశ్రమల వెంట, విదేశీ సాంకేతిక పరిజ్ఞానం వెంటపడ్డారు. ఇప్పుడు ప్రభుత్వం ఎందుకూ కొరగానివిగా ప్రచారం చేస్తూ చాలా ప్రభుత్వ రంగ సంస్థల ఆస్తులను తెగనమ్ముకొని ఆ సొమ్మును లోటుభర్తీకి వాడు కొంటున్నారు. ఇది దారుణం. దీనివల్ల ప్రభుత్వం ఎంతో కష్టపడి ఇన్నేళ్లుగా జాగ్రత్తగా నిర్మించుకొంటూ వచ్చిన ప్రభుత్వరంగ సంస్థల వ్యవస్థ మన కళ్లెదుటే కుప్పకూలి పోతున్న సూచనలు కనిపిస్తున్నాయి. ఈ పరిస్థితులలో దిగుమతులను ఇష్టారాజ్యంగా దేశంలోకి అనుమతించడం ప్రమాదకరం.

నెల్లూరు — కె.విజయ

### అనంతసాగరం చెరువుకు 420 ఏళ్లు

అనంతసాగరం చెర్వుకట్టపై గల శాసనం ప్రకారం ఈ చెరువును 31.5.1520 శాలివాహన శకం 1442 విక్రమ సంవత్సర జ్యేష్ఠ పౌర్ణమి, గురువారం నాడు నిర్మింపబడింది. ఈ తటాక నిర్మాణకర్త రాయసం కొండ మరుసయ్య, తన తల్లితండ్రులు తిమ్మరుసు, శంకాయమ్మల జ్ఞాపకార్థం నిర్మింపజేశాడు. ఈ చెరువు వద్ద విష్ణువు యొక్క శిలావిగ్రహం చెరువు కట్టకు తూర్పున సోమశిల రోడ్డుకు ఉత్తరాన కరతుమ్మ చెట్లలో దిక్కులేనిదిగా పడివుంది. దానికి దిగువన లక్ష్మీనరసింహస్వామి విగ్రహం ధ్వంసమై అనవాళ్లుగా నిర్మాణపు శిలలు చరిత్రకు సాక్షీభూతంగా పడివున్నాయి. శివలింగ మొకటి గ్రామానికి పడమటివైపున సోమశిల రోడ్డులో చుట్టు గుంటపల్లెకు వెళ్లే మార్గాన నీటితోట్ల దగ్గర ఎటువంటి పూజలకు నోచుకోకుండా పడివుంది. ఎంతో చరిత్రగల ఈ శిలలను పునః ప్రతిష్ఠచేసి పూర్వ ఔన్నత్యాన్ని మరలా వెలుగులోనికి తేవాల్సిన బాధ్యత అనంతసాగరం గ్రామ ప్రజలపై వుంది.

కోవూరు — షేక్ అమీర్

# 50 ఏళ్ల క్రితం

3వ పేజీ తరువాయి

నిరసించవచ్చని అతనిపై వారంటును రద్దు జేసే ప్రశ్న అప్పుడు వుదయిస్తుందిగాని యిప్పుడుగాదని తెల్పిరి.

### కండ్లేరు, పిన్నేరులకు ఆనకట్టలు నిర్మించండి

రాపూరు తాలూకా రైతు సభ 16తేది కలెక్టరు మలయప్పన్ గారి అధ్యక్షతన జరిగింది. సభ ముందు టీ పార్టీ, హైస్కూలు కమిటీ మీటింగు జరిగినవి. అందులో శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారు హైస్కూలు భవన నిర్మాణ సహాయార్థం, 1116 రూపాయలిచ్చుటకు వాగ్దానం జేసిరి. ఏటూరు అంకిరెడ్డి ఒక ఎకరా, వెంకటసుబ్బయ్య ఒక రూము. షేకు ఖాజాహుసేన్ సాహెబు స్కూలుకు ప్రక్కనున్న తన భూమి 75సెంట్లను తక్కువ ఖరీదుకిచ్చెదమని వాగ్దానము జేసిరి.

### ఫిష్‌ప్లేట్లు తెగగొట్టబడుట

మొన్న 19తేది ఉదయం మద్రాసునకు వెళ్లు చుండిన కలకత్తా - మద్రాసు మెయిలుకు అదృష్టవశాత్తు గొప్ప ప్రమాదం తప్పిపోయింది.

## దొంగసొత్తు

4వ పేజీ తరువాయి

హ్యాండెడ్‌గా దొరికి నిర్బంధిస్తే వీళ్లు వెను వెంటనే విడుదలకాను సిసిఎస్ కానిస్టేబిళ్లే 'సెర్చ్‌వారంట్' జారీ అయ్యే ఏర్పాటు చేసి సహకరిస్తుండడంతో వీరి 'స్నేహం' ఏమేరకు పాతుకపోయిందో అర్థం చేసుకోవచ్చు.

సిసిఎస్‌ను ప్రక్షాళన చేసే చర్యలో భాగంగా ఎస్పి నరసయ్య, ఇక్కడ ఎస్ఐగా అంతరాష్ట్ర దొంగల ముఠాలను అరెస్టు చేసిన అనుభవమున్న ఆర్. నాగేశ్వరరావును ఇన్‌చార్జిగా నియమించారు. అతనికి సహకరించి పనిచేసే నిజాయితీగల కానిస్టేబిళ్లను నియమించే బాధ్యత ఎస్పిపై వుంది. దొంగలతో స్నేహం చేస్తున్న పోలీసుల తీరుతెన్నులపై ఎస్పి విచారణ చేయిస్తేవారి బండారం బయటపడుతుంది.

## ధరల పెరుగుదలపై కాంగ్రెస్ నిరసన

ఎన్నికల్లో చేసిన వాగ్దానాలకు తిలోదకాలిచ్చి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు విపరీతంగా ధరలు పెంచిన తీరుకు నిరసనగా ఈ నెల 24తేది నుంచి జిల్లాలోని 46 మండల కేంద్రాల్లో పికెటింగ్ చేసి ప్రజలను చైతన్య పర్చనున్నట్లు డిసిసి అధ్యక్షుడు సివి శేషారెడ్డి చెప్పారు. 18తేది ఇందిరాభవన్‌లో విలేకరులతో మాట్లాడుతూ ఏప్రిల్ 9, 10తేదీల్లో ఈ విషయమై జిల్లా కలెక్టర్ కార్యాలయాన్ని ముట్టడించాలని తీర్మానించామన్నారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మధ్య తరగతి, బీద వర్గాల వారు గ్యాస్, బియ్యం, గోధుమలు, కిరోసిన్ కొనలేని విధంగా రేట్లు పెంచాయి. యూరియా రేట్లు పెంచి రైతుల వెన్నెముక విరిచారు. ప్రజాపంపిణీ వ్యవస్థనే అస్తవ్యస్తం చేసేశారు. ఈ రేట్ల పెంపక విషయమై ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు అపాతభూతి రాజకీయాలు చేస్తున్నారు. కేంద్ర ప్రభుత్వాన్ని ఇబ్బంది పెట్టని విధంగా నిరసన ఏ విధంగా తెలియజేస్తారో, ప్రజలకు తెలియ చెప్పాలని సివిశేషారెడ్డి కోరారు. చంద్రబాబు మాటలకు, చేతలకు పొంతన వుండదు. ఇప్పటికే రాష్ట్రంలో రెండుసార్లు పెంచిన విద్యుత్ ఛార్జీలను మళ్లీ పెంచడమేమిటి? పెంచిన విద్యుత్ ఛార్జీల వల్ల 100 యూనిట్లలోపు విద్యుత్ వాడే వారి మీద 43శాతం, వ్యవసాయదారుని మీద 60శాతం అధిక భారం పడుతుందన్నారు. చంద్రబాబు విధానాల వల్ల రాష్ట్రం 30వేల కోట్ల రుణభారంలో కూరుక పోయిందని, 2వేల కోట్ల రూపాయల మొత్తంతో మార్చినెలలో చెల్లించాల్సిన బిల్లులను ఇప్పటికీ చెల్లించక పోవడంతో ప్రభుత్వ పనితీరును అర్థం చేసుకోవచ్చన్నారు. ముఖ్యమంత్రి వీడియో కాన్ఫరెన్స్‌ల్లో నిధులు లేకుండా అధికారులతో విధుల గూర్చి మాట్లాడుతున్నారు. జిల్లాలో 46 మండలాలను కరవు ప్రాంతాలుగా ప్రకటించినాపైసా కరవు సహాయం అందలేదు. బ్యాంకుల రుణాలు రీ షెడ్యూల్ కాలేదు, విద్యార్థుల ఫీజులు రద్దు కాలేదన్నారు. ఈ యేడాది బడ్జెట్‌లో సోమశిల, కండ్లేరు ప్రాజెక్టులకు చిల్లిగవ్వ కేటాయించక పోయినా జిల్లా మంత్రి, అధికార పార్టీ శాసనసభ్యులు పట్టించుకోలేదన్నారు. జిల్లాలో రెండవ పంటకు నీళ్లివ్వకుండా కండ్లేరు దగ్గర అప్రోచ్ ఛానెల్ త్రవ్వి 7 టిఎంసిల నీటిని మద్రాసుకు అందివ్వడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తోందని, ఈ విషయాలను జిల్లా ప్రజలు అర్థం చేసుకోవాలన్నారు.

## డాక్టర్ రాజమ్మ సేవలు ప్రశంసనీయం

రాష్ట్ర ప్రభుత్వం అమలు చేస్తున్న వివిధ పథకాలన్నింటిలోనూ మహిళలను భాగస్వాములు చేసేందుకు ప్రభుత్వం అత్యధిక ప్రాధాన్యత కల్పిస్తుందని ఇళ్ల మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డినెల్లూరు జ్యోతినగర్‌లోని డాక్టర్ రాజమ్మ హోమ్‌లో ఇటీవల ఏర్పాటు చేసిన కార్యక్రమంలో మంత్రి ముఖ్యఅతిథిగా పాల్గొని మాట్లాడారు. ప్రభుత్వ వుద్యోగం చేసి పదవీ విరమణ చేస్తున్నవారు ఎక్కువగా విశ్రాంతి తీసుకొంటారని, కాని డాక్టర్ రాజమ్మలా పేదలకు సేవ చేసేవాళ్లు అరుదుగా వుంటారని ప్రశంసించారు. నిరాశ్రయులైన మహిళలకు ఎటువంటి సహాయం అవసరమైనా చేసేందుకు ప్రభుత్వం సిద్ధంగా వుందన్నారు. వికలాంగులకు మంజూరు చేసే గృహాలను నిర్మించే విషయంలో బేస్‌మెంట్లను కూడా ప్రభుత్వమే నిర్మించే విషయమై ముఖ్యమంత్రి దృష్టికి తీసుకవెళతానన్నారు. రాపూరు మాజీ ఎమ్మెల్యే ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి, పిసి.రెడ్డి, ఐపిఎస్. నాయుడు, ఆర్డీట వెంకటేశ్వర్లు, డాక్టర్ రాజమ్మ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## కాళిదాస జయంతి సభ

నెల్లూరు వర్ధమాన సమాజం, కుమారి పునుగు రమామణి స్మారక నిధి సంయుక్తంగా మహాకవి కాళిదాస జయంతి సభను 23తేది టౌన్‌హాల్‌లో డాక్టర్ ఉడాలి నరసింహశాస్త్రి అధ్యక్షతన నిర్వహిస్తున్నాయి. గుంటూరు హిందూ కాలేజి ప్రిన్సిపల్ డాక్టర్ ప్రసాదరాయ కులపతి కాళిదాస కవితా హృదయం గూర్చి మాట్లాడి స్మారకనిధి దాతలు డాక్టర్ పునుగు ఆదిలక్ష్మి, అల్లాడి ప్రమదాంబ, యడవల్లి పద్మావతి చేతుల మీదుగా సన్మానం పొందుతారని, సమాజం

## నెల్లూరుసంగతులు

4వ పేజీ తరువాయి

కావడం లేదు.

అధ్యక్షుడు అగస్త్యరెడ్డి వెంకురెడ్డి చెప్పారు.

## హౌసింగ్ కార్పొరేషన్ జాయింట్ యాక్షన్ కమిటి

జిల్లాలోని ఎపి స్టేట్ హౌసింగ్ కార్పొరేషన్‌లో పని చేస్తున్న డిప్యూటీ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లు, అసిస్టెంట్ ఇంజనీర్లు, ఎడిఎమ్, మినిస్టీరియల్ సిబ్బంది, మరియు వర్క్ ఇన్స్‌పెక్టర్లు సమావేశమై జిల్లా సంయుక్త కార్యాచరణ కమిటీని ఏర్పాటు చేసుకొన్నారు. ఈ కమిటీకి ఛైర్మన్‌గా సి. జయరామాచారి, వర్కింగ్ ఛైర్మన్‌గా సి. బాలయ్య, జనరల్ సెక్రటరీగా వి. నరసింహం, వైస్ ఛైర్మన్లుగా టిఆర్ఆర్. వరప్రసాద్, ఎ. విజయానందరాజు, వి. అహ్మద్ బాషా, కోశాధికారిగా టి. మురళిలను ఎన్నుకొన్నారు. సవరించిన వేతనాలు, ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంటు స్కీమును తమకు ప్రభుత్వ ఉద్యోగుల మాదిరిగా వర్తింప జేయాలని కోరుతూ ఇళ్లమంత్రి ప్రభాకరరెడ్డికి, జిల్లా కలెక్టర్‌కు వినతి పత్రాలిచ్చారు.

## ఉచిత కంప్యూటర్ శిక్షణ

నెల్లూరుటౌన్ జూనియర్ ఛాంబర్, గుల్షన్ పబ్లిక్ స్కూల్, సన్‌టెక్నాలజీస్ సంయుక్తంగా అన్ని వర్గాల యువతీ యువకులకు ఉచిత కంప్యూటర్ శిక్షణ ఇవ్వనున్నాయి. శిక్షణ పూర్తయ్యాక ఇచ్చే సర్టిఫికేట్‌కు ప్రభుత్వ గుర్తింపు కూడా వుందని నిర్వాహకులు చెబుతున్నారు. ఇతర వివరాలకు శ్రీమతి సల్మాబషీర్, కౌన్సిలర్, ట్రైకసరోడ్డు, నెల్లూరు, చిరునామాలోగాని, ఫోన్ నంబర్లు 320223, 334712లోగాని తెలుసుకోవచ్చు.

## విక్రమం

-రసిక్

విక్రమ ఉగాదీ
వసంతోదయాన వచ్చి వాకిటవాలవలసిన నీవు
అనంగుని అనుంగు సఖుని విక్రమాన్ని చూడవలసిన నీవు
నీవెక్కిన విమానం ఏ తీవ్రవాదుల పాలనో బడి
ఏగాంధార దేశంలోనో కూలబడి
హడలిచచ్చి, చచ్చిబ్రతికి, బ్రతికి బయటపడి
ఇంత ఆలస్యంగా వచ్చిన దానవు నీవు
ఏమున్నదిక వీక్షించేందుకు నీకూ
ఈ గ్రీష్మాదిత్యుని పటుప్రతాప విక్రమాన్ని తప్ప
ఆకాశంలో మండుతోన్నది ఒక్క అర్కుడే కాదు
కట్నం తేలేని నవ వధువుల చుట్టూ
క్రమ్ముకొన్న స్వార్థాగ్ని కీలలూ,
భూమిని నమ్ముకొని జీవనం సాగించే
సన్నకారు రైతులను కబళించే ఋణాగ్ని కీలలూ,
మధ్యతరగతి సంసారుల చుట్టూ అలముకొన్న
ధరల, పన్నుల తాలూకు దావాగ్ని కీలలూ,
నిరుద్యోగుల నిస్సహాయత నుండి జనించే క్రోధాగ్ని కీలలూ,
మనుషులు రగిలించే ద్వేషాగ్ని కీలలూ,
కులంపేరిట మానవులు కావించే హింసాగ్ని హోమకీలలూ,
పురుషాధిక్య ప్రపంచంలో స్త్రీలను
వెంటబడి వేధిస్తోన్న కామాగ్ని కీలలూ,
ఇలా ఎన్నో రకాల కీలలూ,
ఇనునితోబాటు ఆకసాన్ని
మండిస్తున్నాయి తిలకించు

తిలకించి పులకించావా
నీ విక్రమం వికృత క్రమం
లేదూ, అగ్నిమాపక దళాన్ని నెలకొలిపావా
నీ విక్రమం వారిశ క్రమం

అంబేద్కర్ జయంతిని పురస్కరించుకొని ఆయన విగ్రహానికి పూలమాల వేస్తున్న మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి. ప్రక్కన ఎమ్మెల్యేలు బల్లి దుర్గాప్రసాద్, పరసారత్నం.

## రొట్టెల పండగ

4వపేజీ తరువాయి

ఛార్జీ చేయడం దారుణం. మాటల రూపంలో చెప్పే విధానాన్ని పోలీసులు ఎప్పుడు నేర్చుకొంటారో? పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లో పార్కింగ్ చేసిన కార్లు, జీపులకు 50, బస్సులు, లారీలకు వంద రూపాయల మామూళ్లు ఆధ్యాత్మిక భావన మరచి వసూలు చేసిన పోలీసులను ఆ దేవుడు కూడా క్షమించడు. విద్యుత్‌ను పండుగ జరిగిన మూడు రోజుల పాటు కోత విధించము అని చెప్పిన అధికారులు యధావిధిగా తమ పని తాము చేశారు. గాంధీనగర్‌లోని సాయిబాబా దేవాలయం, ప్రభుత్వ డ్రైవర్ల సంఘం సభ్యులు భక్తులకు ఆకలి వేళలో ఉచితంగా పంచిన ఆహారపొట్లాలు పరమాన్న మయ్యాయి. రోమియోల చేత నాల్గవ పట్టణ ఎస్‌ఐ శ్రీనివాసరావు గుంజిళ్లు తీయించడం పలువురు వింతగా చూశారు. ఎప్పటి మాదిరిగా ఎమ్మెల్యే వివేకానందరెడ్డి ప్రజల సౌభాగ్యం కోసం, మునిసిపల్ ఛైర్మన్ అనూరాధ మునిసిపల్ ఆదాయం పెంపొందాలని భాగ్యం రొట్టెలు పట్టారు. ఈసారి రొట్టెలన్నీ పెద్ద ఇబ్బంది లేకుండా దొరికినా ఉద్యోగం రొట్టె మాత్రం పలువురికి దొరకక రిక్తహస్తాలతో వెళ్లారు. అన్ని రొట్టెల్లో భాగ్యం రొట్టెనే ఎక్కువ మంది పట్టుకోవడం ఈ నాటి మనస్తత్వాన్ని ప్రతిబింబింపజేసింది.

## చిత్రసమీక్ష

9వ పేజీ తరువాయి

అన్ని అంకాల్లో దర్శకుడు ఎక్కువ శ్రద్ధ చూపి అందరూ చూడతగ్గ చిత్రంగా రూపొందించారు.

ఇది ఒక ముక్కోణపు ప్రేమకథ. ఈ ముక్కోణపు ప్రేమకథలో కోణాలు కొత్త పంథాలో సాగుతాయి. ఊహించని మలుపులు తిరుగుతాయి. మంచి సస్పెన్సు వుంటుంది. బద్రి (పవన్ కళ్యాణ్) వెన్నెల (రేణూ దేశాయ్) ప్రేమించుకుంటారు. తల్లిదండ్రులు వారి పెళ్లికి అంగీకరిస్తారు. ఈ ప్రేమ కథకు వెన్నెల ఒకతెరకాసు పెట్టుంది. వేరొక అమ్మాయి ప్రేమను సాధించమని బద్రిని పురికొల్పుతుంది. అతనితో పందెం కట్టుంది. ఒక అమ్మాయిని ప్రేమించి విజయం సాధించక పోతే తాను ఇచ్చిన బహుమతిని ఆమె తీసుకుంటానని, విజయం సాధిస్తే, ఆమె ఇచ్చిన బహుమతిని అతను తీసుకోవాలని పందెం వేస్తుంది. అప్పుడే దేవాలయం నుంచి వస్తున్న సరయును (అమీషా పటేల్) చూపి ఆమెను ప్రేమించి స్వాధీనం చేసుకోమని బద్రికి చెప్తుంది వెన్నెల. బద్రి సరయు ప్రేమను తన సున్నితమైన ప్రయత్నంతో చూరగొంటాడు. సరయు, బద్రిని పూర్తిగా ప్రేమించి పెళ్లి చేసుకో నిశ్చయిస్తుంది. అందుకు సరయు అన్న నంద (ప్రకాష్‌రాజ్) అడ్డు తగులుతాడు. బద్రి, వెన్నెలను ప్రేమిస్తున్నాడనే కారణమే అది. చివరకు వెన్నెల, సరయు ఒకరినొకరు త్యాగం చెయ్యదలుస్తారు. బద్రి ఒకామెకు తాళి కట్టాడు. ఎవరికి కట్టింది చూపడు దర్శకుడు. ఇక్కడ మంచి సస్పెన్సు స్థానం కల్పించు కుంటుంది. సస్పెన్సు తొలగిస్తూ, వెన్నెలను అమెరికాకు పంపిస్తాడు. సరయును, బద్రి వద్దకు చేరుస్తాడు.

అమీషా పటేల్ తన పాత్రను గౌరవప్రదంగా, గంభీరంగా పోషించింది. రేణూ దేశాయ్ చిలిపిగా చలాకీగా నటించింది. ప్రకాష్‌రాజ్ ఆర్భాటం అదరగొట్టేస్తుంది. రమణ గోగుల సంగీత దర్శన బీట్‌తో ఆకర్షణీయంగా వుంది. చిత్రం, అన్ని హంగులతో పట్టుగా అమరి అందరూ చూడతగిందిగా వుంది.

## అందాలు

9వ పేజీ తరువాయి

అర్థాంతరంగా ఆగిపోయింది. ఇందుకు ఆ చిత్ర నిర్మాత షబ్నమ్ కపూర్ ఐశ్వర్యారాయ్‌ను తప్పు పడుతోంది. కేవలం ఆమె సహాయ నిరాకరణ వల్ల చిత్రం ఆగిపోయిందని దీనివల్ల కోట్ల రూపాయలు తాను నష్టపోయానని, దీనికి ఐశ్వర్యే కారణమని కోర్టులో కేసు దాఖలు చేసింది.

## సినిమా

9వ పేజీ తరువాయి

అమీర్‌ఖాన్‌ల సరసన నటించాలని కోరికున్న వాళ్ల తన కన్నా పొట్టివాళ్లు కావడంతో అవకాశం రాదేమోనన్న బాధను కూడా వ్యక్తం చేసింది.

# రమేష్‌రెడ్డికి పార్టీ బహిష్కారం తప్పదా?

"నెల్లూరు, అనంతపురం జిల్లాలలో రెడ్ అలర్ట్ ప్రకటించాలను కొంటున్నాను; ఈ రెండు జిల్లా తెలుగుదేశం పార్టీ పరిస్థితి ఛండాలంగా వుంది; ఒకరిద్దరిని పార్టీ నుంచి బయటకు పంపితే తప్ప పరిస్థితి మారేటట్లు కన్పడటం లేదు".

ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడి మాటలు ఇవి; మునిసిపల్ ఎన్నికలపై జిల్లాల వారీగా సమీక్షలు జరిపే సమయంలో చంద్రబాబు ఈ అభిప్రాయం వెలిబుచ్చారు. ఆయన ఎవరి నుద్దేశించి ఈ సూచనలు అన్నారో ప్రత్యేకంగా చెప్పబనిలేదు. ఈ వ్యాఖ్యలు సూటిగా తగిలేది - రమేష్‌రెడ్డికి. ఆ సమావేశంలో రమేష్‌రెడ్డి సైతం వున్నారు. కాని ముఖ్యమంత్రి కళ్ల పడకుండా కుర్చీచాటు చేసుకొని, ముఖం దాచుకున్నారు. సమీక్ష జరిగినంత సేపూ తల కూడా ఎత్తి చూడలేదు. ఆయన తరపున ఛైర్మన్ అనూరాధ ఒకటి రెండు మాటలు మాట్లాడబోయినా ముఖ్యమంత్రి విన్పించుకోలేదు. ఎవరు ఎంత మాత్రమో నాకు బాగా తెలుసు; మీరేమి చెప్పనవసరం లేదు అని కసురుకున్నారాయన. దినపత్రికలలో ప్రచురితమైనట్లు - చంద్రబాబు, రమేష్‌రెడ్డిని మందలించడం, తిట్టడం జరగకపోయినా, రమేష్‌రెడ్డి రాజకీయ భవిష్యత్‌కు ఈ సమావేశం ఒక సూచికగా భావించవచ్చు.

మునిసిపల్ ఛైర్మన్‌గా తన భార్యకు జిల్లా మంత్రి అదాల ప్రభాకరరెడ్డిని అకారణంగా దూషించడం, నెల్లూరులో రైలు దిగితే ఆడవాళ్ల చేత అవమానిస్తానని నోరుపారేసుకోవడంతోనే రమేష్‌రెడ్డి పట్ల అందరిలో ఏహ్యభావం ఏర్పడింది. అది చాలదన్నట్లు వైస్ ఛైర్మన్ ఎన్నికలో సిగ్గు బిడియం విడిచి, తెలుగుదేశం అభ్యర్థిని ఓడించడంతో పార్టీ

## నోటిదురుసుతనం, విశ్వాస ఘాతుకత్వం, రాజకీయ భవితకు మంగళం పాడాయి.

టిక్కెట్ తెచ్చుకొని, గెల్పించుకోవడంతో ఆయనకు రాజకీయ పునః ప్రాభవం ప్రారంభమైందని అందరూ భావించారు. కాని చేతికి అందివచ్చిన అవకాశాన్ని నేలజార్చుకోవడంలో తనకు సాటి ఎవరూ లేరని నిరూపించుకున్నారు రమేష్‌రెడ్డి. ఎన్నికలు ముగిసీ ముగియగానే టిక్కెట్ ఇప్పించిన పెద్దలకు ముఖం చూపించ లేకపోతున్నారు. వైస్ ఛైర్మన్ ఎన్నికకు పరిశీలకుడిగా వచ్చిన రామభద్రయ్య పార్టీకి సమర్పించిన నివేదికలో రమేష్‌రెడ్డిపై చర్య తీసుకోమని స్పష్టంగా సిఫార్సు చేశారు. మంత్రి ప్రభాకరరెడ్డి నానా తంటాలు పడి తెచ్చిన ఇద్దరు స్వతంత్ర కౌన్సిలర్లకు క్రాస్ ఓటు వేయమని చెప్పడం; మూలపేట కౌన్సిలర్ నూనెమల్లికార్జున యాదవ్ తను చెప్పిన ప్రకారం క్రాస్ ఓటింగకు సమ్మతించక పోవడంతో నోటికొచ్చినట్లు తిట్టడం; నేను చెప్పిన అభ్యర్థికి టిక్కెట్ ఇవ్వకుంటే ఏడుగురు కౌన్సిలర్లు పార్టీకి సెల్యూట్ కొడతారని బెదరించడం. ఎన్నికలో తెలుగుదేశం ఓడిపోగానే సంతోషంతో చిందులు వేయడం వంటివన్నీ రామభద్రయ్య తన నివేదికలో పేర్కొన్నారు. దాదాపు పది పేజీలలో నీట్‌గా టైప్ చేసి ఇచ్చిన ఆ నివేదికను పార్టీ సమీక్షా కమిటీ యదాతథంగా స్వీకరించింది.



తిక్కవరపు సుబ్బరామిరెడ్డి వివాహ రజతోత్సవపు వేడుకలో ఆయన్ను అభినందిస్తున్న ప్రముఖ పారిశ్రామిక వేత్త అనిల్ అంబానీ.

ఇంకొక ప్రక్క జిల్లా ఎమ్మెల్యేలందరూ - ఒక్క సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి మినహా రమేష్‌రెడ్డిపై సిఎంకు ఫిర్యాదు చేశారు. రమేష్‌రెడ్డిపై తగిన చర్య తీసుకోకపోతే జిల్లాలో పార్టీ మలకనై పోతుందని చెప్పారు వారు. అసలే సిఎంకు రమేష్‌పై సదభిప్రాయం లేదు. ఛైర్మన్ టిక్కెట్ ఇవ్వడమే ఇష్టం లేదాయనకు. మంత్రి ప్రభాకరరెడ్డి పట్టుదలతో ఒప్పుకోక తప్పలేదు. ఇప్పుడీ తప్పులన్నీ శిశుపాల వధకు వలె ఉపకరిస్తున్నాయి. అది మనసులో పెట్టుకొనే చంద్రబాబు సమీక్షా సమావేశంలో అంతమాట అన్నారు.

తనెంత తప్పుచేసిందీ ఇప్పుడు అర్థమైనట్లుంది - రమేష్‌రెడ్డికి! మంత్రి ప్రభాకరరెడ్డి కోపం తగ్గించమని పివి. ప్రసన్నరెడ్డికి మొరపెట్టుకున్నాడట. వైస్ ఛైర్మన్ ఎన్నికలో తెలుగుదేశం కౌన్సిలర్ల చేత క్రాస్ ఓటింగ్ చేయించినందుకు ప్రసన్నరెడ్డి నుంచి రమేష్‌రెడ్డి పెద్ద మొత్తం ముట్టిందని ఝూడిగా తెలుస్తున్నది. ఆ ప్రతిఫలం అందుకోవడానికి ప్రసన్న దగ్గరకు వెళ్లినప్పుడు, కొసరుగా ఈ సిఫార్సు అడిగినట్లున్నాడు. అయితే ప్రభాకరరెడ్డి మనసు చాలా లోతుగా గాయపడివుంది; ఏ పైపూత మందులతో అది నయం కాదు. ఇంకొకప్రక్క కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్న కుమార్‌రెడ్డి వద్దకు వెళ్లి - ప్రభాకరరెడ్డికి వ్యతిరేకంగా చంద్రమోహన్ రెడ్డితో చేతులు కలపమని అభ్యర్థించాడట. కావలి ఎమ్మెల్యే వేణుగోపాలరెడ్డి, గూడూరు ఎమ్మెల్యే దుర్గాప్రసాద్‌లను కూడా కలిసి తనకు సాయపడమని అభ్యర్థించినట్లున్నాడు.

చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకోవడం అంటే ఇదే! నమ్మిసాయం చేసిన వ్యక్తులకు, పార్టీని కూడా విశ్వాస

తరువ 7వ పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Ph: 091-861-327364. Offset Printing at Zamin Ryot Press, Nellore